గారు తీర్చుటయు లోనగు సంశయములచే మొట్టమొదటిచరణము చెప్పునప్పుడు కాలము విశేషించి వృథా కావలసివచ్చినది. ప్రకృతమీగ్రామముననున్న కక్షుల్ని బట్టి కొందఱు మహానుభావులు తమనామములు డాఁచి యెట్లు వ్రాసినను తుదక[illegible]కూడ జయప్రదముగనే జరిగినదనుటచే వీరియవధానశక్తి యెట్టిదో మేము విశేషించి వ్రాయనక్కఱలేదు. శివరాముఁడని యతినీచముగా దూషించుటకుఁ జేయివచ్చిన మహానుభావులకుఁగూడ వీరియవధానశక్తి శ్లాఘ్యముగుటయేకాక యితర దేశీయులగు యూరోపియనులకుఁగూడ నపారానందము నొనర్చినదని విన్నవించుకొనుట కెంతయు సంతసించుచున్నారము. వీరు నూఱుపద్యములను ప్రతిజ్ఞాపూర్వకముగాఁ జదివి సభ్యుల కపారానందమును గల్గించిరి. ప్రసిడెంటుగారును కాలేజీ ప్రిన్సిపాలుగారును సుమారు ముప్పదిపద్యములక్కడక్కడ నడిగి యింతకన్న వీరిని గష్టపెట్టుట యుచితముగాదని యంతతోనే తృప్తిచెందినను శివరామశాస్త్రిగారు మఱునాఁడు మరలసభఁ జేయకతప్పదని పట్టుఁబట్టి ఆసభలో వరుసగా నెల్లపద్యములను జదివితీరిరి. ఈకారణముచేతనే యీయవధానమున కైదుదినములుపట్టినదిగాని లేనిచో మంగళవారము రాత్రితోడనే యిది ముగియుటచే నాల్గుదినములేయని వ్రాయుటొప్పగు. వీరి యవధానమునుగూర్చియు ధారణాశక్తినిగూర్చియు బాండిత్యమునుగూర్చియు మెచ్చినపండితుల పద్యములీయవధానాంతమున ముద్రింపఁబడినవి. ప్రిన్సిపాలుగారగు డాక్టరు యూల్ దొరగారియొక్కయు వైస్ప్రిన్సిపల్ రివరెండు స్టాక్సుదొరగారియొక్కయు సదభిప్రాయముల నీక్రిందఁ బొందుపఱచుచున్నారము. ఇందలి గుణాగుణములను పద్యములే తెల్పునుగాన నావిషయమును జదువరులకే వదలుచు నింతతో ముగించుచున్నారము.

ఇట్లు,
కాలేజీవిద్యార్థులు.

Dear sir, 14th October 1911.

It gives me pleasure to write my opinion on the *Satavadhanam* as far as I witnessed it, lately performed in the College Hall. The tests of the Sastri's powers of memory were thorough and enacting To me they seemed unnecessarily exhaustive, with a chance to each and every comer to question the poet. One may, indeed I think must, conclude that the sentences, the phrases and the arrangements of words on a miscelaneous set of 100 subjects, done in poetry, will become the same or similar in the different exhibitions of powers, at different places. From this view it is the least part of the Sastris skill that he can make 100 poems, impromptu upon 100 Subjects chosen at random. He may, therefore, repeat himself. Neverthelees he can not repeat himself altogether unless he has friends, abettors, who at each place propose the same subjects, and somewhat in the same order. The way the 100 subjects were proposed in Guntur is against any theory of help from friends on the whole. The Sastri has therefore shown in Guntur, a wonderful quickness and diversity of power in producing poetry on the occasion.

Seeing then, that his subjects and the order of the same, can not be alike on separate exhibitions of his skill, I am the more impressed with the marvelous power of memory he possesses. That this is a trained power is apparent, but then the training too, shows itself marvelous. It has occurred to me that a possible explanation of this power of memory might be the Sastri's practice on all possible subjects before hand, making him prepared for anything to be proposed. He would thus have an all-comprehensive repertoire from which to draw. However, if he did this, his repertoire would be a marvel of supply the like of which I have never heard. He therfore plainly has a power of concentration and of registration in his memory that excels anything I had hitherto imagined.

I repeat, then, that the exhibition has been to me the manifestation of a wonderful power of impromptu poetry making and of a marvelous power of remembering and recalling such impromptu poetry.

I am very respectfully
yours,
L. L. UHL, M. A., Ph. D.,
*Principal,*
A E. L. M. Colleg, Guntur.

II

16th. Oct. 1911,

Dear sir,

The experience of attending a *Satavadhanam* was indeed something new. I had heard of the Powers of men in India in performing intellectul feats but this was the first opportunity of witnessing any thing of the kind. To say the least, I was greatly impressed with the evident power of the *Satavadhani.* His ability to ccncentrate upon an impromptu subject-even in the midst of the unavoidable confusion in the Hall was to me remarkable. I can imagine power to compose extemporaneous poetry, but to compose it line after line at long intervals of time, and then to remember not only the numbers belonging to the varions subjects but also the actual lines produced, must surely be considerable almost marvelous

Personally, I am glad for the opportunity of actually witnessing this power, and am pleased to congratulate most heartily the *Satavadhani* himself.

Yours sincerely,

J. ROY STROCK. M. A., B. D.,
Vice Principal and Professor of Science,
A. E. L. M. College, Guntur.

శ్రీమత్పరదేవతాయైనమః.

# గుంటూరుకాలేజీశతావధానము

చ॥ ఎఱుఁగఁడు పిల్లకాయ యెటులేనొనరించుశతావధానమున్
సరసులు మీరలెల్లరును సభ్యులు పేర్మిననుగ్రహింపుఁడా
దరమునఁదప్పులన్ విడిచి తద్దయు నొప్పులెచూచి మెచ్చుఁడీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుని వృద్ధికామునిన్॥ (వెం॥ శా॥)

సీ॥ సకలజనానురంజకమృదుసంగీతసాహిత్యనిధి జోగిశాస్త్రినెన్ని
పాణినీయాగమస్వర్ధునీసమవతరణభగీరథుభగీరథునిఁదలఁచి
అద్వైతశాస్త్రచింతాప్తసత్త్వవిశేషభామహితానంతరాముఁబొగడి
శతలేఖినీపద్యసందర్భనిర్భరుల్ తిరుపతి వేంకటేశ్వరుల కెఱఁగి
గీ॥ భావశుద్ధినిబొంది శతావధాన
కార్యకరణమ్మునకుముందుఁగాలి నిడఁగఁ
బూనినాఁడను బ్రశ్నింపఁబూనుఁడనఘు
లఖిలజనులకుఁ గర్ణరసాయనముగ॥1॥

శా॥ శ్రీరమ్యాష్టశతావధానములలోఁ జెన్నొందు నష్టావధా
నారంభంబది శ్రోతకున్ గడువినోదార్హంబు నీషన్మనో
భారంబౌను శతావధానమునఁ జెప్పన్ శక్యమే! కష్టవి
స్తారంబుల్, తగదీనిఁ జేయుకవి యేతన్మాత్రుఁడే చూడఁగన్॥2॥

ఉ॥ ఈమహనీయకృత్యమిది యెట్టిదినా! వివరింపఁగత్తిపై
సాము, సమర్థనంబుకొనసాఁగినఁగీర్తికిమేరలేదు కా
లామయపీడితుండయినహానికిమానములేదు గాన నీ
జామునసీదయాప్రతిభ చక్కఁగనుండవలెన్ మహేశ్వరీ!॥2॥

విద్యున్మాలావృత్తం—కాళీ.

వందేకాళీంశ్యామార్ధాంగీం। శంభోర్దేహే సంసక్తాంతాం
జ్ఞానంవిద్యాంబుద్ధింనీతిం। శ్రేయోభూయోభూయోదాతుం॥1॥

గురుస్తుతి

చ॥ సరసగతిం బ్రబంధములు సారవదర్థపరీతమౌనటుల్
విరచనఁజేసిరాజులనవీనసభాస్థలమందుబంగరుం
బిరుదులు కీర్తిపత్రములు పెండెరముల్ గ్రహియించినారు మా
తిరుపతి వేంకటేశ్వరులు దేశికులర్హులు మానమస్కృతుల్॥2॥

గురువులున్న సభనవధాన మొనర్చుట

చ॥ గురువులు లేనిసత్సభలఁ గొంచెము భీతియు లేక పాండితీ
గరిమముఁజూపి పండితులఖండులు పామరులున్ ముదంపడన్
విరచనఁజేసినాఁడ నిటవీరలుగల్గఁగ భీతియెంతయుం
దఱచుగ హెచ్చెడున్ బహువిధంబులఁదగ్గెడు నేమిచిత్రమో॥3॥

ప్రకృతసభ

ఉ॥ పల్వురు పండితోత్తములు పల్వురు హూణకళార్థి సంఘమున్
బల్వురు సత్కవీశ్వరులు పల్వురు ప్రేక్షక సత్తముల్ మఱిం
బల్వురు న్యాయవాదులును బల్వురుదేశికులున్ బుధుల్ కృతుల్
పల్వురుమానవుల్ గలసభాస్థలి దీనినుతింపశక్యమే॥4॥

సమస్య

ఉ॥ ఓకమలాయతాక్షి వినియుందువు చైద్యునకిచ్చి నన్ను, సు
శ్లోకుని గోపికాధవునిఁ జోరునిగా గణియించి యీయఁగా
నీక చెలంగునంట తగవే! యిదియిట్లని తెల్పు తండ్రికిన్
(కాకికి రాజహంసి సతిగాఁగలదే తలపోయ భూధవా)॥5॥

పిల్లలనోట వ్రేలు నిడికొనుట.

సీ॥ తలతలలాడు కాంతుల మీఱు నఖమును
నింపు చంద్రుఁడను సందేహముననో

పితృదేవతలకు నొప్పిదమైన తర్జని ప్రక్కగా
నుంటఁగా పాదుకొఱకొ
పెనురూకలను లెక్కపెట్టెడి యుపకరణంబిదియనుచు
ముదంబుపడియొ
తల్లి దగ్గఱ లేనితఱియందు నమృతంబు నంచితంబుగను
స్రవించుననియొ

గీ॥ వ్రేలుపసిపాప నోటిలోఁ బెట్టికొనుచుఁ
బ్రక్కలందున నిద్రించు నిక్కువముగ
దానియానందగరిమ నేదగఁ దలంపు
జరపుచుండుఁడి యోసభాస్తారులార॥6॥

నిర్యతిప్రాసకవిత్వము

మ॥ యతియుంబ్రాసము లేకయే కవితకై యాలోచనల్ సేయుస
ద్మతిసంఘంబులు పూర్వసత్కవులరథ్యన్వీడి యల్లంత దు
ర్గతికిం బాలుగఁ జేయుచుండిరకటా ! కష్టమ్ముకష్టమ్ము స
న్నుతికిందప్పెదురింక భూమినవధానుల్ ధారణాహీనులై॥7॥

సమస్య

ఉ॥ పల్లలితానురాగమున శారద సుందరసుందరీమణీ
పల్లవితాంతరంగ కవిబాంధవిశారదనీరదాంగ సం
పల్లలితాంగి సర్వనుత మానసిక క్రియనాఁగనొప్పున
(త్తల్లిమగండు తండ్రియని తల్పకకూడియు సాధ్వియయ్యెఁగా॥8॥

సమస్య

శ్లో॥ సదాకాన్తాయాలంకృతమతి విలాసావిరహిణీ
తమోగ్రాసావస్థాంవరహిమరుచేః ప్రేక్ష్యమనసి
ముదంయావత్త్వాపత్సపదివిశదం తావ దచిరా
(దమాయాంసాపశ్యద్వియతి పరిపూర్ణేందుమబలా)॥9॥

„ధూమజ్యోతిస్సలిల" అను శ్లోకమునకుఁ దెనుఁగు

మ॥ పొగకుంజోతికి వాయునీరములకుం బుంజంబుగానొప్పు నీ

మొగులే! డెక్కడ మాంసలేంద్రియత నెప్పొంప్రాణిచేఁ బంపఁగాఁ
దగువార్తాతతి,యంచులెక్కగొనకంతన్ వేఁడెయక్షుండు న
వ్వగఁగాములౌ బళిరే! జడాజడములన్ స్వాభావదీనుల్ గదా॥10॥

ధూమకేతువు

సీ॥ లోకమ్ములన్నింటి, జీకాకుఁగాఁజేయ ధర్మరాజెత్తుపతాకయనఁగ
చంచలభావముంకించియంజనసుతుండేకంబుగా నెత్తుతోఁకయనఁగ
సకలలోకంబులఁజల్లార్పఁగాఁజేయు లక్షణంబులకిది లక్ష్యమనఁగ
యమునిలోకంబునఁగొమరారు కాంతులరాజిల్లు మేటితోరణమనంగ

గీ॥ సకలలోకంబుభీతిల్లు చర్యఁజూపి
మేటిరాజులదిగమ్రింగిమెలఁగుచుంటి
వింకనైననుమాపయిఁ గృపదలిర్ప
రాకయుండంగదమ్మ యోతోఁకచుక్క॥11॥

సత్కవిత్వము

శా॥ సారాచారవిచారభారములచర్చంజేసి ప్రాసాద శ
య్యారూఢిన్ గుణముల్ సువృత్తములుపాకాదుల్ స్ఫుటంబౌనలం
కారంబుల్ తమయంతదామవిడువ్యంగ్యంబుల్ విచారించిను
శ్రీరమ్యంబుగఁ గైతచెప్పినయెడం జేకొంద్రు విద్యానిధుల్॥12॥

కృష్ణరాయబారము-కర్ణసంభాషణము

ఉ॥ సాధువిలాససంపదకుశౌర్యవిలాసపురంధ్రికిన్ సమా
సాధితమైనగేహమనఁజాటుగగొంతియె సూర్యునిన్ సమా
రాధనజేసినిన్నుఁగనె రాధకుఁబుత్రుడవైతివైననా
బోధనవిన్మపాండవులఁబొందుమనెన్ మురవైరి కర్ణుతోన్॥13॥

కృష్ణుఁడు-లయవిభాతి

చలువగలసౌరభము చెలువములుగల్గునలచలిగరువునందుఁ
గల వెలఁదుకలతోడన్

లలితగతిఁగామునికి నెలమిఘటియించుచునులలిసుఖములంగొనుచుఁ
బొలుచునలకృష్ణున్
దులయెచట లేక యెవిమలమగుమదిన్ బొలుచునలఘులనుబ్రోచెడి
విపులసుకృతరాశిన్
దలఁచెదనిరంతరముకలయునుయశంబుదగఁగలుగఁగనొనర్చినను
విలసితునిఁజేయన్ ॥14॥

అలుకుగుడ్డ

సీ॥ శృంగారకట్టచేఁ జిమ్మిననేలపై జలమునిక్షేపించి యలుకుకొఱకు
ఎదిరిమాటనునిర్వహింపనేరకపాఱువిబుధులమొగములవిసరుకొఱకు
భూమిపైనీర్పడిబొబ్బలుపొక్కంగఁజెలువారఁగా సరిచేయుకొఱకు
పడిపోవుగోడలనుడికంబుగాఁగూర్చి మెఱసెడిరీతిగా మెత్తుకొఱకు
గీ॥ మొండిగోడలపైనిగాపుండి సిద్ధ
ముగను జెలువారుచుందువు బెగడుదెగడి
యింపునింపుదునిన్ను వర్ణింపఁదరమె
వెలఁపుకలపంటగడ్డ! యోయలుకుగుడ్డ॥15॥

సుభద్రాపరిణయమున బద్యమునకుఁబ్రతిపద్యము

చ॥ కనియె విలాసలీలనధికస్ఫుటదంబుజ పంక్తి నిర్వమత్
ఘనసురభిభ్రమద్భ్రమరతల్లజఝుంకృతికానుషంగకృం
తనపటుపాపభంగయతిధాళధళాఢ్యతరంగరంగదీ
శనవకిరీటరంగశుభసంగను గంగఁదగంగఁజెంగటన్ ॥16॥

గండుఁజీమ..కవిరాజవిరాజితము

ఒకయెడఁబుట్టల నెత్తగుచెట్టుల నొక్కెడ గోడలలోపలవే
ఱొకయెడనుండుచుఁబిల్లలఁబట్టి మహోద్ధతలీలఁగఁబీకుదువో
సి! కట! నినుందగఁదీయఁగఁబోవఁగ శిర్షముపీడకపట్టుకయుం
దుకదయాయోగ్యులతోలినపోవరు దుర్మదులౌచుఁబిపీలికరో!॥17॥

నిజమైన కవులెవరు?

శా॥ ఆచంద్రార్కమువెల్గునెవ్వనిప్రబంధాదుల్ తదాలోచయి

త్రాచాంతిన్ బొనరించిమాటికినిహృద్యంబై నితాంతంబుసా
మీచీన్యంబుననొప్పిమానవులనున్ మేధావులన్ జేయున
ర్వాచీనంబగు కైతనెన్నవలదేవాక్ఛుద్ధియేపారఁగన్ ||18||

లచ్చి-అచ్చ తెనుఁగు

ఉ|| చిల్కవజీరువాఁడుగయిసేయఁదొడంబురుడించి యేన్గుఁగుల్
కుల్కుచుఁదొండముల్ పఱుఁదగుల్కొనమేటికడాని కుండలం
జిల్కుచునీరు, పెన్మిటియుఁజెల్వుగఁజెంతనఁబొల్చియుండునా
కుల్కుమిటారిలచ్చిఁబురికొల్పెదనామదినాదియుండఁగన్ ||19||

హూణవిద్యార్థులు

శా|| స్నానంబుంజపముందపంబుబలిమిన్ సంధ్యాద్యనుష్ఠానముల్
మానున్ „నాన్సెను”సంచుఫూలనుచుదంభంబొప్పఁగా వైదికం
గానంగాఁబలుకున్ మతైక్యమును జక్కంజాటు నెల్లప్డు శ్రే
ష్ఠానూచానపుమార్గముల్ విడుచుహూణాధీతి స్వేచ్ఛాగతిన్ ||20||

ఉ|| చెప్పఁగ నెప్పుడున్ గణన సేయఁగఁజాలక మూలనుండునా
తప్పుడుకైతసభ్యులనుదప్పదుతన్పిన యేనికుత్సయాఁ
గప్పురపుంజపుల్ బలెనిగారముమీఱెడుకైతయుండనే
రొప్పదురయ్య! తుచ్ఛములయోగ్యులుకైకొననెంతురేమతిన్ ||21||

ఒకరిచ్చినకల్పన

మ|| అకటా! పుత్త్రికుఁడొందు తండ్రియును లేఁడయ్యో విదేశంబునే
రక యేగెంగళసంగ్రహించుటకు నౌరా! భోజనంబెట్టులిం
టికడన్ వచ్చినరీతిగామినుపరొట్టెల్ గల్గునే! పిండివం
టకముల్ గల్గునె! యంచుఁ దల్లియపుడేడ్వంబోలు గగ్గోలుగన్ ||22||

తిరుపతి వేంకటేశ్వరులు-తిరుపతి వేంకటేశ్వరులతో శ్లేష

సీ|| సత్కళాదాతృత్వచర్యవాఁడొతండు సత్కళాదాతృత్వచర్యుఁడితఁడు
ధరణీధరోపదాభరణకుండొతండు ధరణీధరోపదాభరణుఁడితఁడు

సుమనోఘటాసదశ్శోభితుఁడాతండు సుమనోఘటాసదశ్శోభియుతుఁడు
స్థిరభరతిరుపతితీర్థుఁడాతండు సుస్థిరభరతిరుపతి తీర్థాశ్రితుఁడు

గీ॥ గానవెల్లెడను శతావధానగరిమ
డంబుమీఱంగఁ దాఁబ్రకాశంబునందు
సరసతిరుపతి వేంకటేశ్వరులుగూడ
సరసతిరుపతి వేంకటేశ్వరులుగారె॥23॥

ఒకరిచ్చినకల్పన

శా॥ శాఖైక్యంబునఁబొల్చుచున్నతటిఁదచ్ఛాఖాంతరీయుండుత
చ్ఛాఖాభేదముసేయనెంచి కవులన్ సఖ్యంబు లేకుండదు
ర్వైఖర్యాదులఁజూపఁబోరుపొసఁగెన్ రాజీకినై యెల్లరున్
లేఖల్ వ్రత్తురుగాక దానివలనన్ లేశంబు భాసిల్లునే॥24॥

గానకవితలు

క॥ గానము విను మాత్రాననె। నూనానందమ్ము గొల్పు నుజ్జ్వలమయివి।
జ్ఞానము కైతందఱచిన। చోనందునఁ దనివి మదికి సుఖమిచ్చు వెసన్॥25॥

యతిచెడె గతిచెడె మతిచెడె స్మృతిచెడె

చ॥ యతిచెడెఁ బిల్లకాలువను గ్రోలితరించెనటంచుఁ బల్కఁగా
గతిచెడె సభ్యులందఱు వికావికనగవుంబొనర్పఁగా
మతిచెడె నేఁటిదుష్కవుల మాయకవిత్వము చేజనాళికిన్
స్మృతిచెడె నట్టివారలను చేరికఁ జేరఁగఁదీయువారికిన్॥26॥

స్త్రీవర్ణనము

సీ॥ నిండుచందురుఁబోలు నెమ్మోము జిగితోడ
సిరులుగుల్కెడి వేణిభరముతోడ
కలువఱేకులఁబోలు కండోయిరుచితోడ
నేవుచూపెడి లేఁడిచూపుతోడ
చిల్కపల్కులఁబోలు కుల్కుపల్కులతోడఁ
దళ్కులొల్కెడి మేనిబెళ్కుతోడ

నకనకలాడు నెన్నడుముసొబగుతోడ
కావిమించెనపూవుమోవితోడ
గీ॥ సరవిదమితూఁడుబోలు బాహువులతోడ
బెడఁగుటరఁటినిబోలు పెందొడలతోడ
తొలఁకురసములనొప్పెడి పలుకుతోడ
వెన్నెలంబలెవచ్చెడి వెలఁదిఁజూడు॥27॥

శరత్తు

మత్త॥ కాలువల్ బురదందొలంగినిగన్నిగన్నిగమీఱెడున్
పోలఁజెర్వులయందు నెల్లెడఁబుండరీకములుండెడున్
దాలిమిన్వులవెల్లమబ్బులుతద్దయుంజెలువారెడున్
లీలమైశరదాగమంబుదలిర్చిమేలువెలార్చినన్॥28॥

కాలేజీలో నవధానముజరుగుట

ఉ॥ ఓజమెయిన్ముదంపడిమహోద్ధతరీతిశతావధానమున్
రాజితహాకశార్ధితత్ప్రార్ధనజేసెనుగుంటురందుఁగా
లేజిప్రిన్సిపల్లుగఁదలిర్చినడాక్టరుయూలుగారుకా
లేజినినీయనియ్యెడలలింజటిగెన్ గడుఁజిత్రపద్ధతిన్॥29॥

సమస్య

శా॥ శ్రీవిశ్వాసమునాదరించుచును బుంజీభూతసంసారదు
ర్భావంబుంబొనరించుచుంబ్రబలపాప బుల్దగంజేయుదు
ర్ధీవైషమ్యముగల్గువారికినినెంతేదుర్గతుల్ వచ్చునా
జీవుండాపరమాత్మతోఁగలసినంజేకూఱువేదుర్గతుల్॥30॥

వేఁపకాయ

పంచ॥ రవిప్రరోచిమీఁదఁబాఱ రమ్యమైనత్తునాఁ
దవంభ్రమంబొనర్చుచుండుఁదద్రసంబుకాకవుల్
చవింబొనర్చితప్పగాఁగఁజల్పుచుండనెండచే
తవ్వాడి వెట్టివేఁపకాయ తాల్మివీడియుండెడిన్॥31॥

సమస్య

ఉ॥ శ్రీయుతమావనాంతములఁ జెన్నలరారెడికోకిలాళుల్
హాయిగఁ బెంచుచుండు నల యామ్రవణంబతిచోద్యమాఁజుమీ
మాయురె! దానిపండ్లకుఁ బ్రమాణమదెంతన నిట్లువల్కెఁడెం
(కాయలు పండ్లుగావు మఱికాయలుగావఁట పండ్లుచిత్రమే ॥32॥

రామరావణ సంవాదము

మహాస్రగ్ధర.

పొలియింతున్నిన్నటన్నంబొలియఁగనిను నేఁబొల్పుగాఁ జేతునంచున్
దళియింతునిన్నటన్నందళనమునిను నేఁదద్దయుం జేతునంచున్
బలుకుల్ చెల్వారఁగా రావణుఁడున్మఱియుం బార్థివుండైన రాముం
డెలమిందర్పింప లోకంబిటునటుకదలెన్ బృథ్వియెల్లంజలించెన్ ॥33॥

వసంతము

శా॥ హర్షావాప్తికి మూలమై గుమురులై యామ్రాదివృక్షంబు లు
త్కర్షంబుం బొనరింపఁగా శుకపికధ్వానమ్ములేపార దు
ర్ధర్షంబై మలయానిలంబెగయఁగందర్పుండు సూనావళీ
వర్షంబుంగురిపింప నామని కడుంభాసిల్లె మొల్లంబుగన్ ॥34॥

శివ-విష్ణు-శ్లేషః.

వందేహిమాచలప్రియం । గంగాభూషిత విగ్రహమ్
పాపాపనోదనామానం । హరిరూపంహరంహృది॥35॥

కవిప్రయోజనము

చ॥ ధర యపవిత్రమై నెగడిధర్మము వీడిచరించు వేళ ము
ష్కరులగు ధారుణీపతుల కాండముగా జనసంతతింబర
స్పరమును నైకమత్యమును బాయఁగజేయఁగసత్కవీశు వా
గ్గరిమను దత్త్వముంగని జగంబఖిలంబును డంబుమీఱెడిన్ ॥36॥

తెనాలి రామలింగఁడు

ఉ॥ లోకమువారలెల్లరును లోకువఁజేసి తెనాలిరామయన్
బ్రాకటసత్కవిత్వపరిపాకవివేకపదాదిరూఢు సు

శ్లోకుని దిట్టు కైతయని చోద్యము మీఱఁగ నవ్వు కైతయం
చాకలనంబు సేయుదురు న్యాయమె! భావ్యమె! యిట్టులాడఁగన్ ॥37॥

జ్ఞప్తి హీనః

శ్లో॥ రజఃక్రాన్తే భస్తన్యపి పతితమాజ్యం భువి యథా
నదీధారామధ్యే లిఖితమభిరామాక్షరమివ
గభీరాంధ్రప్రాప్తోదకవృతదళత్కుంభమనుయన్
భువిజ్ఞప్త్యాహీనోపి వదతి హి సంబోధితమనాః॥38॥

పటమునందున్న యెడ్వర్డు కాలు సేతుల నెత్తుటఁ గూర్చి (అచ్చ తెనుఁగు)

ఉ॥ వచ్చిన వేడ్కమై నిబగ వారల నెల్లర నుక్కడంతు నే
నెచ్చెలులంగరంబుఁ బురుణించి తగందరిఁ జేరఁ దీతు నా
హెచ్చుగఁ గాలు చేయి పయి కెత్తుచుఁ జిత్తరువందునుండు నా
నచ్చినవాని జేనినిఁ గనందగు నెడ్వరుడన్న యేలికన్ ॥39॥

సూర్యోదయపద్మములు-లయగ్రాహి.

ఇమ్ముగను మంచియుదకమ్ముగల యట్టివితతమ్మయిన మీనములు
గ్రమ్ముకొనితాటా
కమ్ములను నెల్లపుడు ఝుమ్మనుచు మ్రోయు భ్రమరమ్ములను
నొప్పుచును దొమ్మియొనరింపన్
తమ్మిచెలికాని కిరణమ్ములకు సంతసము గ్రమ్ముకొనఁ బద్మ
ములు నెమ్మిఁ గనువిచ్చన్
గమ్మని పరీమళము గ్రమ్ముకొనె దిక్కులను శమ్ము నరఁ జేసె
హృదయమ్ములను వేఁగన్ ॥40॥

సమస్య

ఉ॥ చెందొవబోలు నెమ్మొగము చెల్వగు దత్కరపల్లవంబు జ
క్కందన మొప్పు కన్నులు వికాసిత నెప్పెడు మేనుదీవయున్
సుందరమైన రూపుగఁ సుందనముం గని మోహవార్ధి ని
(ష్పందిపటుక్కనంగొరికెఁ బంకజలోచన మోవి గ్రక్కునన్)॥41॥

### 42॥ కాసుగొడ్డుకు-రూకబంది

గీ॥ సెంటుచేనున కెకరమ్ము చెలఁగుఁగంచె। జేనలంజెకు బారపౌండ్లైనలంక
కానిముండకురూపాయిక్షౌరమటులు। వీఁకనొక కాసుగొడ్డుకురూకబందె
కప్ప

చ॥ గరరవరట్టట్టంచుగరగఱ్ఱిటగఱ్ఱిటగఱ్ఱిటంచు దు
ర్భరమయి యొప్పుశబ్దములఁబల్కుటచూచి సహింపఁజాల నో
విరసపుఁగప్ప! యావలకు వేగమతర్లుమ! లేచిపొమ్ము! దు
స్తరమగునల్కఁబూని యొకర్రతోఁచు నినుంగబళింపనెంచెదన్ ॥43॥

### హిందువులు క్రైస్తవులవలెవృద్ధికావలెను

సీ॥ సకలదేశములందుజర్చిలుస్థాపించు క్రిష్టియన్మతమువారినిఁదలంచి
ప్రథితపత్తనములపాఠశాలలనుంచు గ్రిష్టియన్మతమువారినిఁదలంచి
వైద్యశాలలఁబెట్టిభద్రంబుగల్పించు గ్రిష్టియన్మతమువారినిఁదలంచి
హుండాలకనువైనచందాలసమకూర్చు గ్రిష్టియన్మతమువారినిఁదలంచి
గీ॥ హిందుదేశమువార లానందమొంది
భరతవర్షంబునందునఁ బాఠశాల
లాదిగాఁగలపనులను నమరజేయఁ
జెల్లుమీకిది హిందుదేశీయులార॥44॥

### అప్పుడక్కడనుండిన గ్రుడ్లగూబ

సీ॥ శతవధానవిధానసంధానమందున నపశకునమటంచు నాగినాఁడ
కన్నుఁగానకమంచి తెన్నుఁజూడఁగ లేకయటునిటుతిరుగుట యరసినాఁడ
గబ్బికంపుల పెంపుగన్పింప ఱెక్కలల్లాడంగఁదిరుగుట యరసినాఁడ
ఈగూటిలోనుండియాగూటిమీఁదికి నలవ్రాక నెగురుటయరసినాఁడ
గీ॥ గడ్డముల్ మీసములులేని కౌశికుండ
కవితఁజెప్పఁగలేనిఘూకవివరుండ!
చూడఁగావచ్చినాఁడవు నేఁడిచటికి
కుటిలరుతములదూబ! యోగ్రుడ్లగూబ॥45॥

ఉచ్ఛిష్టగణపతి

శా॥ విద్యాకౌశలినేర్పుపొంటె బహుధావిద్వత్సభారంగమం
దుద్యోతింపఁగఁగోరి వేడ్కమెయి నాయుచ్ఛిష్టవిఘ్నేశ్వరున్
సద్యోవిద్యకుమూలమైనయతనిన్ సాక్షాత్కృతుంగొల్చియీ
విద్యార్థుల్ తరియింపకుందురొకో! షడ్విద్యాసముద్రంబులన్ ॥46॥

ఆకాశము

ఉ॥ శాంతసముద్రముంబలె విశారదుఁడై యలరారునట్టివే
దాంతిమనంబుపోలె జలదంబులఁదారకలన్ వెలింగె నా
శాంతరలంబమానవివరాంతరపూరణచాతురీధురీ
ణాంతకకంతుకాదిపరిహారిశిరోరుహరూపమేపగున్ ॥47॥

చంద్రోదయః-మందాక్రాంతా

మందాక్రాంత్వానవకరపుటైశ్శైలశృంగాణిపశ్చా
త్స్పృష్ట్వావృక్షాన్ మృదుకిసలయైశ్శోభమానాన్ మహీయాన్
భూమింస్పృష్ట్వాతదనుచగవాక్షాంతరైరంతరిత్వా
స్త్రీణాంపుంసాంప్రణయకలహంమోచయామాసచంద్రః॥48॥

పరశురామః-శిఖరిణి

కదాచిన్మాతంగప్రబలతరకుంభాన్ విదళయన్
కదాచిత్పత్తీనాం కరచరణపంక్తింశిథిలయన్
కదాచిద్దుర్గర్వాన్ భయదనరపాలాన్ వికలయన్
భుజాకండూం చండామిహపరశురామోఽమృజదహో ! ॥49॥

గడ్డిపోఁచ [గ

సీ॥ వెలిఁబాఱుసెలయేఱుపాలిమేరకట్టలమొలచియుంటివిజగన్మోహనము
ఉవిదలింపెసలారునుప్పరిగలక్రిందఁబెరిగియుంటివికడుంబెరిమమెఱయ
వరిపైరుపొలములదరినుండుగనికట్టలందియుంటివిమహానందపటిమ
పూఁదేనియలబలంబునసారణులపొంత నంకురించితివకళంకముగను
గీ॥ మొగముచూడంగమిగులనామోదమొదవు
మొదవులకుఁదిండివైతివామోదగరిమ

నిన్ను వర్ణింపఁదరమటే! నిర్జితారి
రాజముఖగహ్వారాలంకరణమ! తృణమ! ॥50॥

కుగ్లరు

సీ॥ దూరోగవిధ్వంసధోరణీకీర్తివిసార కుగ్లరుదొరసానిగారు
రాజాధిరాజకార్యప్రమేయవిభాసిచర్య కుగ్లరుదొరసానిగారు
ప్రథమగార్భిణసతీప్రాగ్భారదుఃఖవిసార కుగ్లరుదొరసానిగారు
ధనహీనమానవతతిరక్షణోపాయచర్చ కుగ్లరుదొరసానిగారు
గీ॥ అమెరికానుండియే తెంచి యీసుపత్రి
పెట్టికష్టములనుగని పెట్టి గుంటు
రందునుండెడియీపె ప్రయత్న మహాహా
వర్ణనీయంబుగాదె విద్వాంసులకును॥51॥

52 బెస్తవాని సూర్యునితోఁబోల్చుట

క॥ సంద్రమున వారిగములెల్లం ద్రచ్చుచు స్వీయకార్యలంపటుఁడయి ని
స్తంద్రగతిఁబోవు దాశున! కుందైర్యమూర్తునకు సాటిఁగొల్పెదరవికిఁ॥

ప్రభాతము [వారు

సీ॥ పొలయల్లమైనుండియలిగిన వెలఁదినొప్పించిమించుచుఁగౌఁగిలించు
తెలవాఱుదాఁక రతులఁదేలి బుజములఁగలిపి షికారుకై వెడలువారు
మంచితావులఁ గ్రుమ్మరించుఁబూదండలఁబూరి పైవిడనాడిపోవువారు
మణితమ్ములనువిని మగుడఁబఠించుఁజిల్కలపొలఁతులకువాకట్టువారు
గీ॥ ఒడలెఱుంగక పండుకయుండువారు
ఎంచిపాఠములన్నిఁ బఠించువారు
కొలఁకులందున మునుఁగంగఁగోరువారి
చేతఁదెలియంగఁబడియెఁబ్రభాతమహిమ॥53॥

దోమతెర

చ॥ పొలఁతియుఁగాంతుఁడుం గలసి పొంపిరివోయెడు మోహవార్థిలో
నలరుచునుండ దోమతెరయడ్డమునుండుటఁజేసి కుట్టలో

పలికినిఁబోవుచుండ నటబంధితమయ్యెనుగన్నులందుఁబై
బలమ్మటిచేష్చునాఁగ మొఱపంబులమ్రోసెడి దోమయద్దిరే॥54॥

పాళీ

శా॥ సౌలభ్యంబుగఁగాకితంబులపయి౯ సారింపఁగానాకలం
బాలంబించుచుదానికొట్టకొననెయ్య౯ జేర్చివ్రాయంగము
త్యాలంబోలెడునక్కరాలగుమిచేత౯ మోదమందింతువౌ
పాళీ! నిన్నునుతింపశక్యమగునే! భాభాసికాంత్యావళీ! ॥55॥

విరహిణీహృదయమమావాస్యనాఁటిచంద్రునితోఁబోల్చుట

(మందాక్రాంతము)

కాంతంబౌ స్త్రీహృదయము వియోగంబుచేఁదాపమేపై
కాంతుంజూడంగను మనమునుత్కంఠమైనైక్యమొంద౯
ప్రాంతంబౌటంగళలఱ నమావాస్యయందంతఁదాభా
స్వంతుంబింబంబునుగలియుజైవాతృకుంబోలెనల్లన్ ॥56॥

దుష్టుడు-లోకోక్తి

చ॥ పొనరుచుదుష్టకృత్యములపూర్వములెన్నియొచెప్పరానివి
చ్చనుబరసిందభోజనముచాగునఁదాగణియించుచుండుఁద
న్నెనసినతప్పుమాటపయికెత్తఁడుకోడలిఁగూర్చి యత్తపొం
తనముగ నీతులంగఱపితాఁజనిఱంకునొనర్చుకైవడి౯ ॥57॥

రెల్లునూఁగు-స్రగ్ధర

గోదావర్యాద్యుపాంతాకులజలగరిమంగొప్పగానేపుచూపం
గాదండింబొల్చురెల్లుంగములపువ్వులలోఁగల్గునూనూఁగునూఁగున్
మోదంబొప్పన్నుతింతుం బురహరమకుటాపూర్వదివ్యస్రవంతీ
యాదోనాథాత్మజాతాయతవిశదకరవ్యాపృతిస్పర్థిశోభన్ ॥58॥

తొమ్మిదేండ్లవాఁడుగజముండునా! గజన్నర యుండునా!

మత్త॥ తొమ్మిదబ్దములేవుసూపఁగఁ దోరమైగజముండునా!
యిమ్ముగాగజమున్నరుండునొ! యీతఁడంచునుసందియం

బిమ్మోయింబడ నేలొకో! శిశు వేపుమీఁటి గజన్నరై
యిమ్మహిందగు లేనిచో గజమేయటంచుఁదలంపుమీ॥59॥

60 అప్రస్తుత ప్రశంస చేయువారు

క॥ అప్రశస్తుతముగఁ బ్రచ్ఛకు । లాప్రవణముఁ జేసి కష్టమందింతురు స
త్యప్రమితిఁ గల్గువారలు । ధీప్రమతుల్ భువిని దమమదిందలపోయర్॥

తాటిచెట్టు విష్ణుతో శ్లేష - (అచ్చ తెనుఁగు)

సీ॥ పులుగుల దోరతన్నుఁ గొలిచియుండుటఁ జేసి లచ్చియొడయఁడనవచ్చు
ఆకసమ్మల్లనఁ గైకొనుటం జేసి లచ్చి నెయ్యుండనవచ్చు దీని [దీని
ఆకుపచ్చని పించియము గల్గుటం జేసి లచ్చి నెచ్చెలియనవచ్చు దీని
కల్లుఁద్రావెడియన్న కాచియుంటం జేసి లచ్చితేఁడనియనవచ్చు దీని
గీ॥ కాననిప్పుడు సోఁకుమూఁకలకుఁ గొంగ
యంచుబల్కెదమిఫుల నెయ్యారముగను
జెట్టులంచును బొలిచెడియట్టి మణిశియ
గూడియలరారు బలుదట్టు తాడిచెట్టు॥61॥

శార్దూలము

శా॥ కాఁపొక్కండు వనప్రదేశముల శంకాలేశముల్లేక తా
నేపుంజూపుచుఁబోవుచున్న తఱిలో నేతెంచె వ్యాఘ్రంబు త
ద్రూపంబుం గని వ్యాకులుండగుచుఁ బాఱుంబోతునుంగాక వా
లూపన్ వాలమునూపి మీఁదఁబడఁగా నుంకించె నెక్కుమ్మడిన్॥62॥

"పిల్ల కాకికిఁ తెలియునే వింటిదెబ్బ"

గీ॥ దేనినడిగిన దానినూనుఁ బరుల నెవ్వరింబైకి దుముకుచుం బ్రువ్వఁదిట్టు
బాలుఁ డెప్పట్ల బెద్దలవదరుచుండుఁ బిల్లకాకికిఁ దెలియునే వింటిదెబ్బ"

చిరిచాప-లయగ్రాహి

అందమగు తేయినడుమందున విరాళి మెయి సుందరినిఁ గూడి
గడుసుందనము మీఱన్
గ్రందుకొని నెత్తములనుందగను నాడుకొననుందగును నెందులను
భూమిపయిఁ జూడన్

సుందరముగాఁ జెలఁగుచుందమ గృహంబునకు నెందఱరు దేఁటఁగను
విందు నొసరించుఁ
గుందనపురంగు నడుమందనర నుండగల దెందుఁజిటిచాప గృహమం
దరుగుమీఁదఁ ||64||

65|| కందము-లక్షణము

కం|| కందము త్రిశరగణంబులఁ। నందంబై మూఁటయతియునటు పై భజసల్
పొందగునలములు నాఱిట। గ్రందుకొనగ జగణముండ రాదట బేసిన్ ||

అగ్రాసనాధిపతి

సీ|| పొల్లుమాటలనల్లి యల్లరిసేసెడు శొంఠికాయలనాపు చూపుచూపు
చెప్పఁగ రానట్టి తప్పుడు ప్రశ్నల వేయువారలనాఁగఁ జేయు చేయు
అనవసరంబుగ నడుగువారల కలహంబు పెంపులను జల్లార్పు నేర్పు
పునరుక్తి ప్రశ్నంబులను నొనర్చెడి వారి యుల్లాసమును నాపు యుక్తి
గీ|| వంగిపురకులజలధి జైవాతృకుండు [యుక్తి
కృష్ణమాచార్యవర్యుండు కెలననుండి
సభకునధిపతియై యొప్పఁజర్చ యేల
నాకుఁ గల్గును శతవధానమున నెందు ||66||

జన్మభూమి-అచ్చ తెనుఁగు

సీ|| పలుకుల వెలఁదుక మొలనూలిచిఱుగంట నెమ్మి రొదలకన్న దమ్ములగుచు
పచ్చకప్పురపు క్రొంబలుకులగనుల తూఁగాడు తావికిజోడు కోడెలగుచు
మినుసిగ వానిజుట్టునఁబుట్టు పెనువాఁక నిండు చెల్మికిఁదోడునీడలగుచు
బంగారుగనులు జొప్పడడంబు మీఱెడు మనికితములకల్లుమామలగుచు
గీ|| నలరుపట్టులయందుననమరియుండఁ
దలపఁగాఁ బోఁడుమానిసితనదు తొంటి
పట్టులందుండమదినిజొప్పలచుఁగాని
సరవివినఁబోమె మన మేకచక్రపుఁగత ||67||

హాలికుఁడు

శా॥ ఆనందంబన వానిదే సుఖమునా నవ్వానిదే తుష్టినా
జ్ఞానంబన్నను వానిదే బలము బింకంబన్న నవ్వాని దె
వ్వానిం బంటయుఁ బాడియుం బొలము పాపల్ పెండ్లముం గూడి ని
త్యానందుం బొనరించువాఁడెగృహి యాహా! హాలికుండేనియుఙ్ ॥68॥

(వసంతము-అంతటబిందుపూర్వతకారముతో)

ఉ॥ అంత దిగంతదంతురనిరంతరకాంతవనాంతసంతతా
క్రాంతలతాంతమంతకదురంతకకంతునిరంతరాంతవా
సంతిక మంతరాంతరనిశాంత లతాంతరకాంతకాంత మ
శ్రాంతము సంతసంబిడె వసంతము సంతతమంతనంతటన్ ॥69॥

భాషాంతరీకరణము

శ్లో॥ ధారాధరధారాధర। ధారాధరవాహదేహధారాసిధయే
అల్లయపీరతస్మైపా । లాయకీయాన్ భూధవ్యాన్య ఇహాలోకే॥70॥

బిడాలోపాఖ్యానపుఁగథ

శా॥ చాలన్ వ్యాఘ్రము సేవఁజేసి యొకమార్జాలంబు కొండొక్క మా
ర్జాలంబుంగని చెల్మిఁజేసి యెదురంజన్ వైచె వ్యాఘ్రంబుపై
నాలోనంగని తత్కృతఘ్నతను గర్జారావముం జేయ మా
ర్జాలంబున్ భువిడాఁగెఁ గూయఁదొడఁగెన్ రమ్మన్న రాదద్దిరే॥71॥

దొంగ

శా॥ చేయిన్ దొంగతనంబు జేసి యొకఁడు దేరికంబుమీఱన్ మహా
మాయన్ బొల్చెడియొక్కదారిని బులిన్ మ్రందించుసింహంబు కం
దోయిన్ భీతిలఁ జేయరాఁగ నతఁ డేత్రోవం దుటాయింప రా
దాయెన్ ముందుననూయియున్ వెనుకగొయ్యన్నట్టులన్ బిట్టునన్ ॥72

“ గొడ్డురాలికిఁ దెలియునే బిడ్డబాధ ”

గీ॥ తానుబృచ్ఛించును శతావధానిఁగూర్చి
ధారణాశక్తి పోవఁగ ధారయుఱఁగ

నెంద్దుఁగష్టముగూర్చునుఁబృచ్ఛకుండు
గొడ్డురాలికిఁదెలియునే బిడ్డబాధ? ॥73॥

చిల్లపెంకు

ఉ॥ బాలురు గుంపులై కొలఁకుపట్టులఁ జేరితరంగమాలికన్
గాలికినొప్పు పాఱుదలఁగాంచుచు నేరిన చిల్లపెంకులం
జాలనఁ జేసి వైవఁగ రసంబులఁగైకొను కాంక్షచేతనుం
బోలెఁ గ్రమంబుగా నడచిపోయి మునింగెడి నట్టియద్గునన్ ॥74॥

గులాబి (అచ్చతెనుఁగు)

ఉ॥ చిక్కవజీరుమన్నదొర సింగిణిగాఁ జెఱకుం గడించెఁ బై
గుల్కెడి నెల్లుగల్గు నెలకోయిలపిట్టలఁ దోడనూనె దా
ముల్కులగాఁగఁగైకొని యెఁబూవుల నైదిటి నోగులాబి! నిన్
ముల్కినిగాఁగఁగైకొనక పోవుట వానికొఱంత యేసుమీ ॥75॥

స్కూలు ఫైనలు

ఉ॥ దేశికు సేవఁ జేయుచును దేశచరిత్ర రసాయనాదులన్
క్లేశముఁ బొంది పాఠముల లేశము తప్పులు లేకయుండ నీ
దేశమునం గళార్థులు నధీతులునైననుఁ బ్యాసుగారు త
ద్దేశమునందుఁ బోలె గణుతింపఁగనీయ దదృష్టహైన్యమా ॥76॥

వితంతుసభ

గీ॥ మగఁడు పోయినయమ్మను మన్పఁడయ్యె
నిసిని భోజనమునుమాకునోసఁగుఁడంచు
జరుపుదురు సభ రిజలియూషనునుఁ బ్యాసుఁ
జేసి విధవలసంఘుంబు జెన్ను మీఱ ॥77॥

పెనిసిలు.

గీ॥ కాకితంబును నల్పునుగాఁగఁ జేయు। దంత్ర వాయఁగ మెల్లన నరిగిపోదు
పంద్రఱకుఁ బన్కి రాగలవిందు నిన్ను। నుతి నొనర్పను నిందింపను పెనిసీల!

సంభావననాఁడు బ్రాహ్మణులు తోరణములు త్రెంపుట

శా॥ బాహాబాహిం కచాకచిందొడరి నిర్బంధించి దూషించి యు
ద్వాహంబందునఁ గ్రొత్తవైదికులు దుర్భావంబునన్ దోరణా
లాహాకారముఁ జేసి త్రెంపఁగను మర్యాదా సమేతాత్మలా
ద్రోహంబుంగని మానిపింతురఁట యోహోవింత గుంటూర్పురీ॥79॥

(సూర్యచంద్రుల తక్కెటబిళ్ళలుగ భూమధ్యరేఖ దండెగ వర్ణించుట)

శా॥ నిండుంబున్నమ తేయి చందురుఁడు కాంతింబొల్చు పద్మాళిమి
త్రుండుం దక్కెడజంట యూపయిని దద్భూమధ్యరేఖల్ జగా
దండెంగాఁగొని కాలవర్తకుఁడు మీఁదన్ తద్ధ్రువాభిఖ్యమా
చెండుంబూని ప్రజాళి సేయునవి తూఁచెం బుణ్యపాపంబులన్॥80॥

వేసఁగి- ఇండ్లు కాలుట

శా॥ జ్వాలాజాలజటాలమై దెసలు కంపంబొంద నింగాలముల్
గోలాంగూలములట్లు పైకి నెగయం గోశ్వాదు లుంకించుచున్
వాలంబుల్ పయికెత్తి పాఱ జనముల్ వాపోవుచుంబోవఁగా
మాలాకారముగాఁగ నూర్పరశురామప్రీతిఁ గావించెడున్॥81॥

"అకృత్యం నైవకర్తవ్యమ్" అనుశ్లోకమునకుఁ దెనుఁగు.

శా॥ చేయంగూడనియట్టి దుష్కృతములం జేయంగఁబోరాదు ప్రా
ణాయాసంబయినన్ శరీరమును మెయ్యంబాసినంగాని తా
జేయంగాఁదగు కృత్యమెప్పుడు విసర్జింపంగరాదెల్లెడం
బో! యంచుంబలుకంగ ధర్మమిది ప్రాముఖ్యంబుగా నయ్యెడిన్॥82॥

సరస్సును- సౌధముతో బోల్చుట.

ఉ॥ అంబువుఁబోలు సున్నపుటొయారపుడాల్ హొయలెందుమీఱఁగా
నింబగుపద్మసంతతియు నెన్నఁగ నొప్పెడిమానికంబనన్
డంబుగనుండ నాచును విడంబముమీఱెడి జంబుఖాన, సౌ
ధంబును నిద్దమౌకొలఁకు ధర్మము మీఱఁదుఱంగలించెడిన్॥83॥

పెండ్లిలో నీరుఁ దెచ్చు బ్రాహ్మణుని కావడిబద్ద విరుగుట

ఉ॥ నిప్పుకలోల్కు వేసఁగిని నీరము దేరఁగఁ బోయి బ్రాహ్మణుం
డొప్పుగ వచ్చుచోనటన యో! యల కావడిబద్ద బద్దలై
యప్పుడు బిందెలుం బగుల నాతఁడు చెందు దురంత వేదనం
జెప్పఁగ రాదు బోధపడఁ జేయఁగ రాదిదమిద్ధమంచిలన్ ॥84॥

దీపమును జ్ఞానముతోఁ బోల్చుట.

చ॥ కళలఖిలంబులుం జదివి కాంచనగర్భునిరాణివాసమై
చెలగెడు సత్సభాస్థలులఁ జెన్నలరారెడి దీపమా! నినుం
గలిహృదయమ్మునందు విమలంబగు జ్ఞానమువోలె నెప్పుడుం
దలఁచెద సంధమందున నిదానముమై కళలిచ్చుచుండుటన్ ॥85॥

[గ్రామ్యపదములతో నల్లమందు మో॥ వచ్చునట్లు వేఁట కేగువారు]

మత్త॥ "నల్లమందును సోకురోరోరి! నాదు బట్టయిదో సినీ
వెల్లు మెల్లు ముసల్లి బొల్లిగ యేను యేటకు మోదురో
చల్లగా" ననిమాటలాడుచు సాగుచుండ్రు గిరాతులుం
బెల్లుమోదముఁ బొంది యెందును భీకరోద్ధతవేషులై ॥86॥

సూది మొన-సీసము

సీ॥ మూఁడుమూర్తులగర్వ బోసిన దేవుని చిమచిమమను కిరణములకన్న
బెళుకు బెళుకు జూచు వెలఁదుక ప్రోడలై కడువాడియగు నపాంగములకన్న
శతవధానవిధాన సమయమ్మునందున కవిహృదయముకుశాగ్రములకన్న
దురముఁ బూనర్చెడు తఱియందు రాజుల పొలుపగు నమ్ముల మొనలకన్న

గీ॥ నిశితమై పొల్చుచుందువు నీదుపోటు
ప్రాణములనైనఁ దీయంగనగును నీవు
చేయునుపకారముల లెక్క సేయనగునె
భూజనావళిసంతతామోది! సూది! ॥87॥

88॥ తుమ్మముల్లు

క॥ ఉల్లసనంబునఁ బోవఁగ। నల్లన నాటెదవు పూవుటడికాలున, నీ
యుల్లసనము మండుత తుమ। ముల్లా! మితిలేనిదుఃఖముంగొల్పెదవే?॥

89॥ దమయంత్యాదినామములు పెట్టుకొనువేశ్యలు

। వ్యభిచరించెడుగణికలు స్వాభిమతము ।
లంచు దమయంతి జానకియంచుఁ జంద్ర।
మతియటంచును బేరులుమాటికొంద్రు ।
వారికపకీర్తి దెచ్చుచవారిగాఁగ॥

“తాంచావశ్యామ్” అను శ్లోకమునకుఁదెనుఁగు

చ॥ దినగణనైకతత్పరమతిన్ సహజాతకుటుంబినిన్ సతిన్
గనఁగల విచ్చవచ్చుగతిఁగాంచనగాత్రను మత్కళత్రమున్
నునుజిగురాకుఁబోఁడులకునున్ వలనొప్పెడియాశబంధమె
య్యనఁబడిపోవునట్టి హృదయంబును నాగు వియోగవేళలన్ ॥90॥

గుండీ

మ॥ పనికై తొందరగాఁగ నేగుతఱిఁ జొన్పంబోవుచో నట్టిటుల్
జని తూనీఁగనుఁబోలెనాడెదవు వాలాయంబుగాఁగోటులన్
బనుపంబాల్పడకుండనుండెదవు పల్మార్నిన్నుఁ బ్రార్థింపనే
రను గుండీ! కరుణింపుమమ్ములనుఁ దోరంబైన మేల్జూపులన్ ॥91॥

ఇద్దఱుభార్యలుగలవానిస్థితి

మ॥ సిగపూలం గయినేసి వక్షమున నిక్షేపించి కంబూరమె
య్యాఁగడున్ సేవలఁజేయుఁగా కలద్విభార్యాయుక్తుఁడింతేనిసౌ
ఖ్యగుఁడెప్పట్లనుగాఁడు నిండువడిమై కల్లోలమావాకలో
నగడొప్పందరణిద్వయార్పితపదుండౌవానిచందంబునన్ ॥92॥

యుద్ధము-వర్షముతోఁబోల్చుట

ఉ॥ అంబుదముల్ రథంబులు శరాళి శరావళిమాడ్కిఁడంకృతుల్
డంబగుగర్జనల్ బలె విలాసమునీనఁగ నాజియొప్పెబల్
సంబరమొప్పవర్షము పసందుగఁదానెగఁబోసినట్లు చో
ద్యంబుగ నెల్లమానవుల కల్లనభీతినొనర్చి పేర్చుచున్ ॥93॥

జ్ఞానప్రసూనాంబ

శ్లో॥ జ్ఞానాంబామిహసంస్మరామినితరా మానంద సంధాయినీం

సంసారద్రుమబీజభాజనమహాపాపౌఘవిధ్వంసనీమ్
యా నిత్యంవిలసత్సువర్ణముఖరీప్రాంతోటజాలంకృతైః
పుష్పైర్భక్తిపరైస్సమస్తమునిభిస్సత్వప్రదైస్సేవ్యతే॥94॥

పూర్వ యుగము.

ఉ॥ రాజులు సత్యతత్పరులు బ్రాహ్మణులున్నిగమార్థబోధవి
భ్రాజితు లర్యులుం దమదువ్యాప్తి నుండెడివారు శూద్రులుఁ
దేజముమీఱ విప్రులనుతించుచు సేవలఁజేయువారుగా
రాజితలీల నుందురు కరంబును బూర్వయుగంబులందుఁగ ॥95॥

అవధానసమయమున మాగురువుల మనస్సు

ఉ॥ ధారణయందు తప్పునొకో ధారగఁజెప్పెడిపట్ల డిందునో
ఊరక వట్టిప్రశ్నముల నూనెడివారలకెట్లు చెప్పునో
ఔర! సభాస్థలంబున నోయారముగామనముండ భీతియో
లారహిఁబుట్టునంచు మదులన్ సుఖముందురు మద్గురూత్తముల్ ॥96॥

97॥ సంజీవకరణి-విశల్యకరణి-సంధానకరణి-సావర్ణ్యకరణి

వీనితోఁజెప్పుట

గీ॥ చెలగుపాంథులకెల్ల సంజీవకరణి। సరసిచెందొవలకునువిశల్యకరణి
తగుఁజకోరంబులకునుసంధానకరణి।కడుఁబకాశించెసావర్ణ్యకరణితరణి

సజ్జకంకితినుకాకి

చ॥ ఎవరునులేరటంచెటఁగియేపునఁగాకముభీతిలేకయు
త్సవముగసజ్జకంకినొకదానిని గింజలకైగ్రహించి తా
నవనవనాహరించుతఱిఁజయ్యనమేల్ వడిసేలనూని బి
ట్టవియఁగఁగాపువైవఁగను బ్రాణముకాకముపీడెనక్కటా!॥98॥

99॥ సమస్య

శ్లో॥ షిద్గేన కేనాప్యభిసార్యమాణా। వివాద్యమానోఽప్యధికేనపుంసా।
గోప్యాకృతీర్నిత్యమలంకరోతి। (స్త్రీయంగుణంముంచతినోపలాండుః)॥

చర్ల బ్రహ్మయశాస్త్రిలవారు

సీ॥ కొలఁకుల కెందామరలు వెలార్చెడి కమ్మతావిడాల్
హాయలకుదీవులనియు
తులలేనిసంపత్తిఁదులదూఁగురాజులకునుమనములు
సమకూర్చుననియు
వేయిభాష్యమ్ముల వ్రాయించి చెలువారు జిలువ
వేలుపువోలె చెలఁగుననియు
జనములకును నీతిమనిపెడిమనుమార్గములకునుగురులు
గాఁబొలుచుననియు

గీ॥ ఎవనిసాహిత్యపటిమంబు నెవనితత్త్వ
శాస్త్రమెవ్వానివ్యాకృతిశాస్త్ర మెవని
ధర్మశాస్త్రముగూర్చి సద్ప్రశంసఁ
జేతు రాబ్రహ్మయాఖ్యదేశికుని నెంతు॥100॥

అవధానము సంపూర్ణము.

చ॥ తిరుపతి వేంకటేశకవిధీరులశిష్యుఁడు శబ్దశాస్త్రభా
సురతరసాహితీగరిమ శోభిలువాఁడు శతావధాని వే
లుగిశివరామశాస్త్రి బుధలోకము మెచ్చ శతావధాన మ
చ్చెరువుగ నేఁడు గర్తపురిఁ జేసి కృతార్థతఁ గాంచె సన్నిటన్॥

మ॥ చెవికింపున్ జనియింపఁ జేయు కవితాశ్రీ గల్గి నానావధా
నవిధానమ్ముల నారితేఱి మృదుగానస్ఫూర్తి నెందేనిఁ గ్రొం
జవులూరన్ జదువంగనేర్చి తనయొజ్జల్ గౌరవమ్మొంద నీ
శివరామార్యుఁడు సత్సభాస్థలులలోఁ జెన్నారుచున్నాఁడహా॥

చ॥ ఇరువదియేండ్ల ప్రాయముననే శివరామశతావధాని యీ
తెలుఁగున సూరిరాట్సభల దివ్యవధానకృతిన్ గృతార్థుఁడై

వఱలుచునుండె నారభగవంతుఁడు సత్కృపచేత నీబుధుల్
స్థిరతర బుద్ధి వాగ్విభవశీలునిఁజేయుచుఁ బ్రోచుఁ గావుతన్॥

శిష్టా హనుమచ్ఛాస్త్రి.
టవున్ హైస్కూలు తెనుఁగుపండితుడు.

---

శ్లో॥ వందేసుందరరూపా। మిందుకలాభాసమానకైశ్యశిఖాం।
వందారుసర్వజనగృహ। మందారలతామిమాంబాలాం॥

ఉ॥ ఈరసచాతురింగనిన నీమృదుభావముఁజూడ నీచమ
త్కారముము ప్పరింగొను పదంబులప్రౌఢిఁదలంప లాలిత
శ్రీరమణీయవాక్యములచెల్వువినంగ మదీయచిత్తమం
దారము బల్లవంబులఁదనర్చెడిఁ "నో శివరామ" మిత్రమా॥

ఉ॥ శత్రులరూపుమాపఁగలశక్తిగలాఁడొకరుండు దివ్యచా
రిత్రుఁడు పూజ్యతన్ సభఁజరించెడివాఁడు శతావధానితా
పాత్రుఁడునుండెనేని ధరభాసిలఁబోదె తదీయబంధుస
న్మిత్రులు పట్టరానితమిమీఱరె మోదపయోధిమున్గుచున్॥

సీ॥ నీదుసామర్థ్యంబు నేఁడెఱింగితిఁగాని యింటిలోనుండు
నాఁడెఱుఁగనైతి
నీదుసామర్థ్యంబు నేఁడెఱింగితిఁగానియింపుగాఁజదువు
నాఁడెఱుఁగనైతి
నీదుసామర్థ్యంబు నేఁడెఱింగితిఁగాని యెకసక్కెమాడు
నాఁడెఱుఁగనైతి
నీదుసామర్థ్యంబు నేఁడెఱింగితిఁగాని కరముచేఁజర్చు
నాఁడెఱుఁగనైతి

గీ॥ నట్టియసహాయశూరుఁడవైన నీవు
కరముమాన్యత గుంటూరుపురమునందు
శతవధానమునొనరించి జాలసంత
సమును నొడఁగూర్చితివిగ లోకమునకెల్ల॥

ఉ॥ అద్వయనీతిపూతుఁడు చిదంబరశాస్త్రి వచించెనిట్లు లో
విద్వదుదగ్రకీర్తి ! సుకవిత్వచమత్కృతిపాత్ర! మిత్రమా!
విద్వదమేయమాన్యపదవీనితరామనుకూలనైజ భా
షాద్వయనిస్సమానమృదుసత్కవితావదనప్రవీణతన్ ॥

ఉభయ భాషాకవితా కరణదురంధరుండు } పిసుపాటి చిదంబరశాస్త్రి, వంగవోలుతాలూకా కరవది.

---

చ॥ నిరుపమబుద్ధిశాలివగునిన్నుఁదమంతటివానిఁగాఁగని
ర్భరమగుప్రేమదిద్ది బుధవర్గముమెచ్చ శతావధాన మ
చ్చెరువుగఁజేయనేర్చుప్రియశిష్యుఁడవంచును సారెసారెకున్
గరుణవెలార్చుదీవెనలఁగారమునీయెడఁజూపుచున్న యా
తిరుపతివేంకటేశ్వరసుధీకవిచంద్రుల సన్నుతించెదన్ ॥1॥

చ॥ ఇరువదియేండ్లయీడునను యీఁడెవరీతనికంచు సత్కవుల్
కరమరుదందియెన్నఁగను గంటకునూర్లకొలందిపద్యముల్
విరచనసేయనేర్చితివి వేయునుఁజెప్పఁగనేటికోర ! యీ
బిరుదుతిరంబుగానిలుపవే ! మరునిన్నిదె హెచ్చరించెదన్ ॥2॥

చ॥ తిరుపతివేంకటేశ్వరసుదేశికభూరికృపాత్తవైదుషీ
స్ఫురణముగల్గు నీవిపుడు పూనినగర్తపు రావధాన మ
బ్బురముగనిర్వహించి జయమున్గడియుంచుట కేమిశంక వే
లురి శివరామశాస్త్రి ! సుజనోత్కరమానిత ! సాధువర్తనా ! ॥3॥

చ॥ ప్రతిభమెయిన్ సభాసదులుబల్మరుమెచ్చ శతావధాన మ
ద్భుతగతిసల్ప నేర్చితివి ; హో! శివరామకవీ ! సెబాసు! నీ
చతురిమ పెంపు వాకొనఁగశక్యమె ? తావక దేశికేంద్రపూ
జితచరణాబ్జసేవనవిశేష మహత్త్వముచిత్రమెన్నఁగన్ ॥4॥

మ॥ కవితాధోరణి బాగుగాఁగుదిరె; వక్కాణింపఁగానేల? పె
క్కవధానంబులు చేయఁగాఁగలవు విద్యావంతులో హాయనన్

శ్రీవరామా! యింకమీఁదఁ గావ్యవితతుల్ నిర్మింపఁగాంక్షింతుఁ;న
ద్యువియాభాస్కరచంద్రతారమయి చెన్నారుఁ వితర్కింపఁగన్ ॥5॥

చ॥ గురుచరణాబ్జసేవ సమకూడిన సత్కవన ప్రవీణతా
స్ఫురణముకల్మి వ్యర్థముగ పోఁకడవెట్టక పెక్కుపోఁకలన్
సరసతరంపుఁగబ్బములు జాణువునై రచియించి పండితా
దరణముగాంచి వర్తిలుచుఁ దద్దయువాసికి నెక్కఁగోరెదన్ ॥6॥

చ॥ గురువరనామముం మఱచి కూళలు వ్రాలెఁజరింపబోకు; త
చ్చరణసరోజ సేవనమెసల్పుమునిచ్చలు; శాస్త్రపద్ధతుల్
సారిది గ్రహించి గర్వమునుజూపక శాంతుఁడవై మెలంగుమీ
తిరుపతి వేంకటేశ్వరుల తీడున నెవ్వఁడొసంగు శ్రేయముల్ ॥7॥

మ॥ క్షితిలో నంబరదేవతా గురుకృపాశ్రీలబ్ధవైదుష్యులై
ప్రతిభాన్విత నిరర్గళాశుకవితాప్రావీణ్యమే పారఁగన్
శతలేఖన్యవధానముం సలుపుచుం సత్కీర్తి నార్జించియు
న్నతులౌ శ్రీపతి వేంకటేశ కవులే ధన్యాత్ములూహింపఁగన్ ॥8॥

ఇట్లు శ్రేయోభిలాషి,
20-9-11 మయలవరపు కృష్ణమూర్తిశాస్త్రి,
ఏలూరు; కృష్ణాజిల్లా.

---

శ్రీ వేంకటేశాయనమః

శ్లో॥ శ్రీశాయభాసమానాయ । సత్యోద్ధారగుణాత్మనే
భక్తాభీష్టప్రదాత్రేచ । జగన్నాధాయ వందనం॥

శా॥ ధీరాగ్రేసరచక్రవర్తులు పరా♦ధీనుల్ కృపాపారగుల్
శూరుల్ దర్పవిభూషణుల్ సుగుణసం♦శోభాయమానాంగులున్
సారాచారవిశారదుల్ కవివరుల్ ♦ శాస్త్రాబ్ధులున్ జేరి గుం
టూరుం విష్ణుపురంబుచేసిరిగదేఁ ♦ దుం చెన్న రాజ్యంబునన్॥

మ॥ ఘనసన్మిత్ర సమాశ్రయస్ఫురణఁబ్రఖ్యాతిన్ బ్రకాశింపఁగాఁ
దనతమ్ముల్ తలలూపఁగాఁగుముదముల్ తారల్ ప్రకాశింపజీ
వనముంగైకొనిసత్కళాకలితశుంభద్విక్రమాటోపస
ద్ఘనుఁ డై నై దవజార్జిరాజుదలపంగాఁజెల్లఁడేయిద్ధరన్॥

సీ॥ శరదంపు శశిపెంపు ♦ సరసంపురచనంపు
గరునంపుకవిపెంపు ♦ కళలసొంపు
కరజాలములఁజాల ♦ వరనీరములఁదోల,
గరిజాలనగఁజాలు ♦ కవితజాలు।
సరసంబుల ప్రమోదంబు ♦ విరసంబులఁ గరంబు,
పరువంబుగలభంగంబు ♦ పాటవంబు।
అరుదారఁ గనపార ♦ వరనీరసంధార,
నరబారు నదిగేరు ♦ నాశుధార।

గీ॥ గలిగియుండిన ధీవరుల్ గానివారె
సరసులేవారిపూర్తికిఁజూడజనరె
వరకవులె పగలబొగలువారుగారె
గలరెపోల్పశతావధానులఁదలంప॥

చ॥ తిరుపతి వేంకటేశుల మదిందలపోసి కళాప్రపూర్ణసు
స్థిరవరమూర్తి నచ్యుత సుసిద్ధి సమాశ్రయనామకుండునా
గురుతరబుద్ధి బద్ధపదకుంజవిరంజితమం జులస్ఫుర
చ్ఛరణవిరాజితాంధ్రకవిశారదు శారదునేనుతించెదన్

తే॥గీ। సకలవిద్యావిరాజిత♦ చంద్రధరుఁడు
సరసకవితావిభూషిత♦చతురముఖుఁడు
ధారణాశక్తిసంగీత♦నారదుండు
ఘనుఁడువేలూరిశివరామ ♦ కవివరుండు॥

ఉ॥ చక్కనిఫక్కిలోఁదనరి♦ శయ్యలనెయ్యమునంది భావమున్
దక్కువనెక్కుడంజనక ♦ ధారసుధారసధారయైరసం

బొక్కటుఁజిక్కఁబట్టిసర◆ సోక్తిని రక్తిగఁబూనిపద్యముల్
లెక్కకుమిక్కుటంబుగవ◆ లింగొనుసీకవిశక్తియుక్తమా

క॥ పదితొమ్మిదివందలపైఁ బదునొకటవవత్సరము సె◆పటెంబరను నెలన్
బదునేటిటునటు తేదులముద మొదవుశతావధాన◆మునుఁగననయ్యెన్

చ॥ పలుకులలేమయత్తసుతు ◆ పట్టిప్రియాంగనతాతవైరిము
ద్దులసుతుచంకనున్నరిపు ◆ ద్రుంచినధీరునికాంతతల్లిపైఁ
దలగకయున్న దానిపయి ◆ దానిపయిన్ బడియున్న దానిపై
నిలిచిన దానిపైనిలుచు ◆ నిత్యవిరాజితుఁ డేలుమిమ్మిలన్

ఆ॥ వె॥ అభినుతింపఁదగు శతావధానముగాంచిసంతసంబుమనముసందడింప
వినుఁడి గొట్టిపాటి వేంకటరత్నము రత్నమాలమీకువ్రాసియొసఁగె

జ వెంకటరత్నము.

---

శ్రీ మకర తేశ్వరాయనమః.

ఉ॥ శ్రీవాణీసతియొక్కనాఁడుపతినిన్ సేవింపశీఘ్రంబుగాఁ
బోవంజాలమినీవు కోపపడఁగాఁబో నాథ భూలోకమం
దావిద్వత్కవులైన నాసుతులు నన్నానంద మొందింపఁగా
రావిలైనదిగాదునానగు విధీ రక్షింపవేవీరలన్॥

సీ॥ గణయతిప్రాసపూరణముకై వ్యర్థపదంబుల నిడుకవిత్వమ్ముగాదు
అక్కడక్కడ రెండుముక్కలగ్రహియించి జల్లిబిల్లిగనల్లువల్లెగాదు
పొడిపొడినుడువులవడిఁ బేర్చి నడిపించు నీరసంబగు చాటుధారగాదు
బెండుపాకము లేక పేలాలపాకంబొ నానుప్పు చప్పిడినడకగాదు

గీ॥ అంచితంబగుబహుళార్థసంచయముల
నించి రసముంచఁ దమిఁ బెంచు, మంచిమాట
లెంచి పరికించి సమయంబుగాంచనుంచు
మించుకై తగణించ విరించికగునె॥

చ॥ పదములురాకయొక్కరుఁడు భావము మాధుర్యముఁ జెందనొక్కఁడుం
బొదలుచువైదికాఖ్యతనపూర్వరసంబు నెఱుంగ కొక్కఁడున్

సదుతెటుకాఁగలారు సరసప్రచురాశువిత్వ వాక్సుధా
విదితచమత్కృతిన్సము లెవీనికి శేషసురేజ్యబ్రహ్మలున్ ॥

చ॥ తిరుపతివేంకటేశ కవిధీరకృషీవలులాంధ్ర సంస్కృతో
ర్వరఁగొనిబుద్ధియుగ్మముల బాగుగదున్ని శతావధానదు
స్తరకవితాదిబీజములఁజల్లఁగ మొల్చి, సుబోధనాసుధా
ఝురులఁ బెరుంగుచున్ సకలశాస్త్రవధానరసగ్రహక్రియా
తురగురుమానసాంకురనిధుల్ గను రూపములెన్నొ తాల్చి; సు
స్వరనిబిడార్ధసంచయవిభావకళాపరిపూర్ణ పాండితీ
గరిమలతాప్రతానము లఖండముగాఁ బ్రసరించి, ధారణా
సురుచిరలాఘవప్రబలసూనములెన్ని యొపూచి, శిష్యవ
ర్గరచితధీవిరాజిత వరాష్టవధాన శతావధానసుం
దరఫలముల్ ఫలించె; మనదాగతజన్మవిశేష సంస్థితిన్
దొరకెనుసత్ఫలంబొకటి తోరముగారుచులన్ని మీరలం
దఱుగ్రహియింపుఁడయ్యయిది ద్రాక్షఫలంబను కొంటిరేమొ కా
దరయఁగఁ దీపియొక్కటియయందుఁ గనంబడుఁ గానియెట్టులన్
సరసత, సద్గుణాతిశయసౌఖ్యమునందులఁ గాంచనేర్తుమే?
మఱికదళీఫలంబనుచు మాన్యులు జెప్పఁగరాదు; దానమా
ధురియును మార్దవంబుపరితుష్టిఁగ జూతముగాని విప్పినన్
బిరబిరజారుపట్టుదల పేరన లేదు గ్రహించినంతనే
గుఱుతగుమాంద్యమున్ మఱియుఁ గొబ్బరికాయయుఁగాదు దానిలో
సురుచియునుండుఁగాని పరిశోధనకై గమకింపఁగష్టమై
పఱగునభేద్యమై సులభభావముఁగాదు మృదుత్వముండదా
మఱియెదియన్నఁ జూతఫలమాయని కొంచెముచెప్పవచ్చు నం
దురుచియుఁదీపి మార్దవమ సూనపుఁబుష్టియు సంస్కృతంబలం
కరణమునన్నియుండి యొసకంబునఁగ్రోలిన సుష్ణమిచ్చియుం
దఱకును సంతసంబెసఁగుదానికిఁ బోల్పఁగవచ్చునన్న నె
వ్వారు పసిబిడ్డలైన సరివహ్వారెయంచు వచింపుచుండిరో

లరె! ఫలుమాఱుఁ గ్రోలుచును లాలనఁ జేయరె! చేయుచుండియు
వ్వారె బహుదీవనల్ తుదకు వారును వీరనసేల యీఫలం
బరుదగు గాన విద్య వాలయన్ గ్రహియింపదె యప్సరోమణీ
విరహవిలాసవీక్షణాలనాకములో; మఱిసర్పరాజశే
ఖరుతలనుండి రత్నములఁ గంజనివాసునిరాణినుండి వి
స్తరమగు దీవనల్ ముగురుసాహితియందున గానమందునన్
దిరమగు ప్రేమనిల్పుచు గణింతురుగావునఁ దత్ఫలంబవో
సరసకవిత్వగానరసచాతురి నొప్పు శతావధాని వే
లురిశివరామశాస్త్రి! మిము లోకులు నెప్డునుతించుచుండ్రు! సుం
దరతరరూప నీదు తలిదండ్రులపుణ్యము నంతకెక్కుడో
గురువుల సత్ప్రభావమిది కోరుచు తిర్పతివేంకటేశులన్
శరణని యెవ్వఁడేని వరుసం జని వేఁడ ఫలంబుఁ బొందఁడే
పరమకళాబ్ధులన్ విగతపాపవిహారుల నాశ్రయించినన్

గీ॥ వంగిపుర కృష్ణమాచార్యవర్యుఁడనెడు
మాస్టరుండఁగ స్టేషనుమాస్టరుగను
శతవధానితఁడింజను సరణిఁదోప
నొకరుడై వరువలె మఱియొకరు గార్డు
కరణి వేంకటతిరుపతి కవులిరువురు
మొదటఁ దుదినుండ నడుమ నుముదముగూర్చు
పృచ్ఛకసుభావపేటికలీడ్వఁబడవె
అనుచుఁ బల్కెడు ప్రేక్షకుండైన గుంటు
పల్లివంశ సుబ్రహ్మణ్య భక్తుఁడితఁడు॥

## శ్రీరాములు

చ॥ తిరుపతి వేంకటేశకవిధీరులశిష్యులు మీరలౌట నా
వరకవియుగ్మవాగ్ఝరియవారితరీతిని మిమ్ముఁ జేరె స
ద్గురుకృపగల్గ నెట్టిపనిగూడఁ దృటిందరియింపవచ్చు నా

కరువలిపట్టిరాముకృపఁగాదె?సముద్రముదాఁటెసత్కవీ!
తిరుపతివేంకటేశకధీరులుదేశికు లందుపైనివ్యా
కరణముఁనేర్చు విద్య శతఘంటపథంబులు తిర్గుచోట్లు శాం
కరికృపఁజూచుతల్లి నినుగండరగండఁడటంచుఁజెప్పవే
లురిశివరామశాస్త్రి! బుధులుందనివొందుదురన్నఁజిత్రమే

ఇట్లు
బెల్లంకొండరామారావుగారిశిష్యుఁడు
ములుకుట్లలక్ష్మీనారాయణశాస్త్రి

---

శ్రీమత్పరదేవతాయైనమః

ఉ॥ ఈతఁడుసోదరుండగుట నేనును నేర్వమియాంధ్రమందునుం
గైతనుఁజెప్ప పద్యములుగల్పనఁజేయఁగమానుకొంటిగా
"యీతఁడుబాలుఁడైనగిరియెత్తె వినోదముగాఁగనన్న"యా
పోతనపద్యమొక్కటి యపూర్వపుసీయవధానశక్తిఁగ
న్నంతనె నామనంబునకుహర్షమొసంగఁగసీనిఁవ్రాసితిన్

ఉ॥ ఎందరులేరుకైసరు లునెందరులేరవధానులిప్పు వా
రందఱుసాటియేయితనిఁ కాశుకవిత్వమునందునైనబల్
విందుమెకానిచేసిరనవేడ్కఁగనిప్పుడుచూచుటబ్బె నా
పొందుశతావధానమునుఁ బూర్తిగసీశివరామశాస్త్రిచేన్

చ॥ గురువులరీతిసీతఁడిలఁగోరియశస్సునుఁ దిర్గుచున్నవాఁ
డిరువదియేండ్లకే కవులకింపుజనింపఁగ రాజగౌరవం
బఱమరలేకపొంద నిపుడాశుకవీశ్వరుఁడున్ వధాని వే
లురి శివరామశాస్త్రి తనులోకమునిండఁగ వానికీర్తితోన్॥

చ॥ బాలుఁడెగాని ప్రాయమునఁ బాండితిచేఁ గడుఁబెద్ద చూడఁగాఁ
బోలును కాళిదాసకవిపౌత్రములన్ రచియించుటందు నా
వేలురి వంశవారిధికి వెన్నెలఱేఁడన వానిఁగన్న యా
తల్లిది భాగ్యమెట్టిదొకదా! భువి భాగ్యమదెట్టిదోకదా!॥

ఉ॥ శ్రీయుసరాజువివెకద! శేషులుదిర్వతివేంకటేశ్వరుల్
ప్రాయమునుండఁగా కవనరాజ్యమునేలుచు రాజ్యమూపయిన్
నీయదె గానఁగా కవులనేర్పున రూపునుమాపి సత్సభల్
జేయుచు కీర్తిఁగైకొనఁగ శ్రీపతిబ్రోచునుగాత సోదరా!

ఇట్లు
గరికెపాటి సీతారామయ్య.

---

బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికి.

మ॥ వరుసన్ కంఠముపై సురస్థలమునన్ వామాంకసామేనరున్
గరమాహ్లాదమునన్ స్వకీయసతులన్ గారుణ్యమేపారఁగా
దిరమానట్టుల నిల్పి స్త్రీలఁదగుకీలిన్ జూడఁగాఁజాటుము
గురుమూర్తుల్ శివరామధీవరునకున్ గోర్కుల్ కడుంగూర్చుతన్॥

చ॥ కరము మనోహరంబయిన కైతమునల్లుటయందసామ్యుఁడై
వరమతి శిష్యవత్సలత వారిజనాభునిఁబోలు వేంకటే
శ్వరనిలయంబుగాఁబఱగు బందరునందయిదారువర్షముల్
జరుపుచు మిమ్మటన్ముదమెసంగఁగఁగంటినొకప్డుధీవరా॥

మ॥ గతమానంబునవచ్చి యీపురమునన్ గాలేజీలోఁజేర; మీ
రతిరుచ్యమ్మును దుర్ఘటమునగు కార్యంబౌవధానంబు నీ
గతివిద్యార్థులమైన మామనవిచేఁ గావించిమమ్మందఱన్
గుతుకంబందఁగఁ జేయఁగాంచితిని కైకోరే నమస్కారముల్॥

శా॥ ప్రాయంబందున చిన్నలయ్యుసభలన్ బాండిత్యమున్ జాటనా
హా; యీధారణశక్తి; పద్యపటిమయ్యారే; రసంబద్దిరే
హాయింగూర్చును గాత్రపుంజవియహా!యంచున్ సభాస్తారులే
ప్రాయఃకోవిదసాధులేపొగడ నేవర్ణింపనేలాయిఁకన్॥

చ॥ సరసనుగానసాహితివిసారకవిత్వకళావిశాల! వే
లురికులవార్ధిచంద్ర! కుశలుల్మును నీచరితంబుఁజెప్పిరా
సరణినెనేనుఁదెల్పనది చర్వితచర్వణమౌనుఁగానఁజం
దురునకు నూలుపోగననుతుల్ తగఁజేసి నమస్కరించెదన్॥

ఉ॥ నారద! యేమివార్తలన నాకపతీ! వినలేదె? యిప్పుడా
భారతి పద్మసంభవునిఁ బాసి మెలంగుచనె; నెందుఁ జేరెనో?
ధారుణిఁ బండితోత్తముఁ దగు దాతయునౌ శివరామ వాక్సుధా
సారభ మొప్ప నాట్యమును సల్పగ నేగె; నదెట్లు? సద్యశో
భారతి నాపెయాట చెలువౌ నవధానములై చెలంగెడిన్

సీ॥ ఏవాఁడు భాగిరథీద్యునిశిష్యుఁడై
శబ్దశాస్త్రంబెల్లఁ జదివి తేటె
నేవాఁడు మెచ్చ నష్టావధానముఁ జాల
లేఁ బ్రాయమున సల్పె లీలకరణి
నేవాఁడు పదునెన్మిదేడున శతఘంట
కవనంబు సెప్పంగఁ గలిగె నెలమి
నేవాఁడు తగ నిర్వదేడులు రాకయే
భాషాద్వయమునందుఁ బాండితిఁ గనె
గీ॥ నెవ్వఁడిట మేము వేడఁగా నియ్యకొనుచు
శతవధానమ్మొనరించె సదయుఁడగుచు
నట్టి వేలూరి శివరామయాఖ్యనీకు
మ్రొక్కు విద్యార్థులకునుగా మ్రొక్కువాఁడ॥

చ॥ తిరుపతి వెంకటేశ్వరులె దేశికులౌనని నేను నెమ్మదిన్
స్థిరముగ నిల్పి వారలనుఁ జేరగ నెంచుచునుంటి నిప్డు మీ
కరయఁగ వారలే గురువులౌటను మీరును నేను నిట్లుసో
దరులముగాన నాయెడలఁ దాల్చుము సోదరభావమెప్పుడున్॥

కం॥ మీతలఁపున మఱవకుఁడీ, చేతును విన్నపమునన్ను శివరామసుధీ
నీతిన్ బట్టు బ్రగ్గడ, సీతారామాంజనేయ చిహ్నము వాఁడన్॥

కంభంపాటి విశ్వనాథముగారిచే వ్రాయఁబడిన పద్యములు.

ఉ॥ బూరెలు తిన్నవాఁడు కుడుముల్ తినఁగోరని రీతిఁ బృచ్ఛకుల్
కోరినపద్దెముల్ విబుధకోటి సెబాసన శాస్త్రి చెప్పఁద।

త్సారముఁ గ్రోలుమీరిపుడు చప్పని వోపాడిమాటలన్ వినన్ !
గోరరుగాన పద్యములుకొన్ని రచించితి నాలకింపుడీ

ఉ॥ తప్పులు లేక నాలుగుపదంబులఁగూర్చి చెప్ప లేమియున్
జెప్పినసంగతుల్ తిరిగి చెప్పరుచించనటం చెలంగియున్
ద్రిప్పలుకోడ నోటిగులతీరుఁగ వ్రాసితిఁగొన్ని పద్యముల్
తప్పులువీడి సజ్జన విధంబున నొప్పులనే గ్రహింపుడీ

ఉ॥ శ్రీకరుఁడార్త రక్షకుఁడు శిష్టజనాశ్రిత పాలకుండును
శ్లోకుఁడు భక్త యోగిమునిలోక మనస్థలనర్తకుండులో
కైకశరణ్యుఁడాద్యుఁడు మహీవలయోత్తమనాథనాథుఁడీ
ధీకవితున్ నిరంతరముధీవిభవంబు నొసంగి ప్రోచుతన్

చం॥ గురువులుమాకు లేరనుచు గొందఱు రెండవ బ్రహ్మలీలబ
ల్గరువపుమాటలాడనది కాదని తిర్పతి వేంకటేశులే
గురుఁవులటంచుఁ జాటితనకున్ గవిజంటకుఁగీర్తి దెచ్చువే
లురిశివరామశాస్త్రి కవిలోకశిఖామణి కేను మ్రొక్కెదన్

చం॥ చిఱుతతనంబునందున నె చెన్నలరారఁగ విద్యనేర్వస
ద్గురువులచెంతఁ జేరి తనకోరిన వ్యాకరణంబు నేర్చియున్
సరసకవిత్వసంపదకుఁ జాటువుచేరిచి మించియెవ్వఁడా
గురువులు మువ్వురన్ దనిపెఁ గోవిదుఁడాఁ శివరాము నెన్నెదన్

కం॥ శివరామశాస్త్రిగారిపుడవధాన మొనర్చి గురువులా నందింపన్
కవివరులుమెచ్చుకొనఁగన్ భువిసన్మాన్యులునుతింపఁబొందిరిజయమున్

శా॥ మీపద్యంబులుచిల్కుచున్న రసమున్ మీధారణాశక్తియున్
మీపాండిత్యము శేముషీగరిమయున్ మీబుద్ధి మీకల్పనా
నైపుణ్యంబును మీకు మీగురులకుం దక్కంగ బ్రాప్తింపఁబో
దీపృథ్వీస్థలియందు నన్యులకు వెయ్యేడుల్ ప్రయత్నించినన్

సీ॥ ఒకరికో యిద్దరికో పద్యములఁ జెప్పి
అవధానములఁ జేయు నల్పకవుల

నను కొన్న విషయము లడిగించుకొనుచుండి
అవధానములఁ జేయు నల్పకవుల
గీతపాదముఁ జెప్ప గిలగిలలాడుచు
నవధానముల జేయునల్పకవుల
పృచ్ఛకులుస్థలము విడువరాదనికోరి
యవధానములఁ జేయునల్పకవుల

గీ॥ వర్తనంబునునిరసించి ఘర్మవంద
మందికినినూత్నప్రశ్నలమందగతిని
షరతులనుమాట మెఱుఁగ కేసల్పితీవు
ధరణినవధానివని యెన్నఁదగవె సీవు॥

గీ॥ శతవధాన మందిట్టి ప్రశ్న శైలి
సత్ప్రబంధకవిత్వంబు సల్పుచుండి
అక్క ముగూర్చుచుంటివి యొక్కనాకె।
గాకసభకంతకును గూడఁగవివరేణ్య॥

గీ॥ మీసమర్థతకింతని మితము లేక
విస్తరంబుగ వర్ణింపవీలు లేక
సముచితమగు నట్లునుతింపశక్తి లేక
మానుకొనుచుంటి నింకొక్కమాట చెప్పి।

సీ॥ పండితులగువారు వహ్వారెయనునట్లుసంస్కృతకవనంబుసల్పుచుండి
ఆంధ్రభాషాజ్ఞానులందఱుమెచ్చఁగానాంధ్రభాషనుకయితనల్లుచుండి
సామాన్యులగువారుచాల సంతోషింపనెప్పుడు నాశువుచెప్పుచుండి
అలసభ్యు లందఱుబలెభేషురాయన నవధానకృత్యంబునాచరించి
గీ॥ పిన్నలకు మాత్రమేగాక పెద్దలకును
పామరజనముకేగాక పండితులకు
సంతసంబును గూర్పఁగ శక్తికలదు
జగముగెలువంగ వెడలుమేజడువులేక॥

గీ॥ సరసులగువారినే చేదివిరసమతులు
దూరిధర్మమార్గంబునే కోరివృద్ధి
గోరిదేశహితము జేయఁగోరికోరి
భూమిఁగీర్తిగాంచంగదే రామశాస్త్రి

కం॥ ఒప్పునె ఈచందంబున
చెప్పుటపండితుల కనుచుఁధీయనియనరన్
ఒప్పనిరీతిని నాడక
చెప్పినదోప్పైనవినుఁడి శివరామకవీ॥

మ॥ కలకాలంబును సత్కవీశ్వరుల ధర్మాకాంగుగ్రంథంబులన్
ఇలయందీశ్వరభక్తిసద్గుణములున్ పెంచ్చించుపాత్రంబులన్
జెలువొప్పారరచించి సత్కవిమహిన్ జీవించుచుండుంగదా
కలకాలంబటుగాన నోకవి! భవత్కార్యంబు జేయందగున్॥

చ॥ తిరుపతి వేంకటేశకవిధీరులు సల్పఁగఁజూచియుండిపీ
గిరుపురశిష్యుఁడైనయితఁడెట్టులఁజేయునో చూడఁదల్చియీ
పురముననున్న బాలకులు పూనిధనంబును గూర్చియీసభన్
జరిపిరిగాన నిచ్చునది సత్కృపఁగైకొని యాదరింపుఁడీ॥

——:o:——

శ్రీమద్బాలత్రిపురసుందరీజగదంబాయైనమోనమః

శ్రీ శివరామపండితేందోపరిష్కృతనవరత్నములు.

కం॥ శ్రీమహిమోజ్జ్వలునిగుకవి । సామజహరివేలురికుల జలధిశశినిభా
కాముశివరామశాస్త్రిని । ధీమతినయిసన్నుతింతు ధీరత్వముతోన్

చం॥ పరమకలాన్వితుండగుచుఁ బండితులెల్లరుసన్నుతింపఁగాఁ
దిరుపతివేంకటేశ్వరసుధీవరశిష్యవిభుండుపండితా
భరణుఁడుసద్గుణాలయుఁడు భాహరియైవెలుగొందునట్టివే
లురిశివరామశాస్త్రిమణి లోకులుధీరుఁడితండనంగఁద

ద్గురువులు మోదమందఁగను గుంటురిపట్నమునందు ధీరుఁడై
మెఱసి శతావధానమును మేలుగఁ జేసెను వాసికెక్కుచున్

చం॥ పరమకలాప్రకాశమునఁ బంకజసూతినిమించి ధీరుఁడై
పరమకలాప్రకాశమున భాలలితేందుజుఖుంచి వేడ్కతో
గురువులు మోదమందఁగను గుంటురిపట్ను నివాసులెన్నఁగాఁ
దిరుపతి వేంకటేశకవి ధీవరశిష్యవిభుండునై నవే
లురిశివరామశాస్త్రిమతి లోకులుకోవిదులీకవీంద్రుఁడై
ధరను శతావధానముల ధాటిగఁ జేయసమర్థుఁడై నసన్
వఱలుచుఁ గీర్తినిన్ బడసి వాసికి నెక్కుచునుండె ధీరతన్॥

సీ॥ చతురాస్యుఁడౌఁగాని చతురాస్యుఁడునుఁగాఁడు
ఘనతరసుకవితా కలల చేత
నార్యేశ్వరుఁడుగాని యార్యేశ్వరుఁడుగాఁడు
మంత్రసత్కృతతపో మహిమ చేత
పురుషోత్తముఁడుగాని పురుషోత్తముఁడుగాఁడు
హరిశాంతబద్ధాత్ముఁడగుట చేత
భారతీశుఁడుగాని భారతీశుఁడుగాఁడు
ధాత్రిదేహోచ్చ సుందరత చేత

తే॥గీ॥ ననుచు విద్వత్కవీశ్వరు లభినుతింపఁ
గాంచనాంగుఁడు ధీరుండు ఘనతిరుపతి
వేంకటేశార్యశిష్యుఁడై వెలసె విబుధుఁ
డయిన శ్రీశివరామార్యుఁ డనఘు లెన్న॥

కం॥ పరమకలాళుల చేతను బరముడుఁ శశి వెల్గుచుండు భంగిఁ దలిర్పన్
సరసకలాళుల చేతను సరసుఁడు శివరామశాస్త్రి పన్నుతికెక్కన్॥

కం॥ ధరలో రత్నంబుల చేఁ బరమజలధి వెల్గుభంగిఁ బటుతరలీలన్
వరగుణగణముల చేతను। సరసుఁడు శివరామశాస్త్రి సన్నుతికెక్కన్

కం॥ అందములగు పదములను। బసందుగఁ బొందించి కూర్చి సత్పద్యములన్
బొందుగఁ బల్కుచునుండును సుందర శివరామశాస్త్రి సుజనులు మెచ్చన్

తే॥గీ॥ సన్నుతార్థకదంబయా శారదాంబ
కరుణతోఁగలలిచ్చుచుఁ గాచుచుండు
రసికసారుని శ్రీశివరామశాస్త్రి
నెప్డుసత్కవిసంఘము లెన్నుచుండు॥

చం॥ అరయఁగ భూరిదుష్కవిగజాంకుశమై విలసిల్లుచుండె శ్రీ
తిరుపతివేంకటేశకవిధివరశిష్యవిభుండు సత్కలా
కరుఁడు సుధీనుతాఖ్యుఁడును కామనిభాంగుఁడు చంద్రకీర్తియున్
సరసచరిత్రుఁడున్ బృధుల సద్గుణయుక్తుఁడు ధీరుఁడైన వే
లురిశివరామశాస్త్రిమటి లోకులు సన్నుతిజేయుచుండఁగాన్॥

సుకవిజనవిధేయుఁడు,
ఘడియారం వేంకటకృష్ణుఁడు.

శ్రీదత్తాత్రేయ పరమ గురుచరణారవిందాభ్యాంనమః

లలితసమస్తసద్గుణవిలాసభాసదులార! వింటిరే
యిలపయి నాంధ్రదేశమున నిర్వురు తిర్పతివేంకటాఖ్యులై
కలరుకదా! యశోధనులఖండులమోఘ కవిత్వచాతురీ
కలిత శతావధానులని కంకణముల్ ధరియించినారు వా
రల నటులుండనిందు శివరామసునామ శతావధానియున్
వెలసెను వారిశిష్యుఁడట! వేలురివంశపయోధిచంద్రుఁడా!
భళిభళి! యెంతపుణ్యమది వానిని గాంచినయట్టి తల్లిదం
డ్రులది! మనోజ్ఞమూర్తి! తెగడున్ శశినాతనికీర్తి! సత్కళా
నిలయము బుద్ధి! ప్రాయమననిండెనొ నిండనెలేదొ యిర్వదే
డులు! శుచియైన వాక్కఖిలలోక సమాహితరాగ రాగని
ర్మలగతిగానసంగతి! సమంజసపాండితి సంస్కృతాంధ్రభా
షలను నకుంఠితంబిఁకను పారతరార్థకవిత్వ ధారయా!

13 జలదమునుండి నీర్వడుట సామ్యమువచ్చునె? రాదు! వంకరం
14 బడిరుచి హీనమైతుదకుఁ బాటవముం జెడి నేలపాలగున్
15 జలదములోని నీర; మల జాహ్నవిమాతను! శుభ్రరూపసం
16 కలితకళానిధాన పదకాండముఁ బొందుటచే సమున్నత
17 స్థలములపొంక నడ్డముల దాఁటుచుఁ జెంగున దూకుటన్ రుచుల్
18 దలిరిచి చక్రకేళి వలె ద్రాక్షవలెన్ మఱినారికేలముం
19 బలెఁగడుఁ దేరి యుండుటను బాదములంబడి సాగిసత్కృతిన్
20 గలుగఁగఁ జేయు శక్తి వినవంతతరంగ సముద్రమోయనన్
21 జెలఁగుటఁ గొంత పోలికకుఁ జెప్పఁగ నొప్పిన నొప్పుఁగావుతన్
22 సులభముగన్ మఱొక్కటి సుశోభితమానుప మానమేదిగ
23 న్పడదిఁక ధారణంగుఱిచి పల్వురు నోటికివచ్చినట్లుగన్
24 బలుకఁగవచ్చుఁగాని యదిపాఠము చేసిన వచ్చువిద్యయా ?
25 పలుకు వెలంది సేసెడు కృపారసపోషణచేత వృద్ధికా
26 వలయును గాక యిట్లగుటఁ బట్టి పరీక్షకుఁ జేయు ప్రశ్నకున్
27 వలయును జెప్పఁగాలయ విభాతియులోనగు పెద్దవృత్తముల్
28 సులభపువస్తుసంగతులఁ జొన్పి యటంచును నడ్గువారికి,
29 మ్ములమదిఁ దోఁచి తోఁచనియపూర్వ సమస్యలకున్ దగన్ జవా
30 బులు మొలపించు చోటులనె బుద్ధిసమస్తము లగ్నమైనఁగా
31 వలెనొకయప్పుడాపయిని వందకుఁ బూతిఁగఁ జెప్పుచున్న చోఁ
32 దొలిచరణాలనిగ్గుటయె దుష్కరమందుల నెగ్గనేనినా
33 వలిచరణంబులన్ మొదటిపాదము వెంబడిచెప్పు ధారణం
34 బలవడు టెంత కష్టమిఁకనప్పుడు చోటులుమార్చి పృచ్ఛకుల్
35 గలిబిలిగాఁగ మాఱినను గందరగోళము సేయుచుండినన్
36 బిలుపఁగవచ్చునేమనము ? నిల్చిన దేయనుకొమ్ము నూటికొ
37 క్కడఁ బొరపాటుకల్గిన నదేమొక లోపము ఘోరధారమై
38 విడివడి చెప్పుచోఁ! బ్రసవవేదన సూతికయే యెఱుంగుని
39 య్యలఘు శతావధానముననట్టివి కష్టములన్ని కల్గియున్

“గలుగఁగ లేదు లేదెప్పుడుఁ గల్గదు లోప మొకండ యేనియ
గ్గలమగుధారణా పటిమగల్గుటె కాని” యటంచుఁ జెప్పచున్
నలుదెసలన్ వినంబడుని నాదము సేయుచుఁ జాటవచ్చెఁగా
బలె ! సుమకల్పితంబతని పద్యములందలిశయ్య ! పద్యముల్
గడకను సత్ప్రబంధములఁ గాంచినరత్నములో యనంగ నొ
ప్పెడునవధానపద్యములపేరున కుందగి లేవు ! శైలిచేన్
నుడివినవల్లెనుద్భవలె నోరుఖరాబుగఁ జెప్ప నేల ? సీ !
కలయభిమానముం దెలుపఁగా నను టేయిది ? యిందబద్ధముల్
గలవెళ తావధానమునఁగానరె నేఁడివియెల్ల నెల్లరున్
గలదువిశేషమింకొకటి కౌతుకపూరిత సభ్యులార ! యీ
తఁడుశివరాముఁడౌటను సదాశివతత్త్వము విష్ణుతత్త్వమున్
దలపఁగ నెక్కటేయను యథార్థముచూపుచు దృష్టిచాలకీ
వడినసహాయుఁడై జనులువర్ణన చేయనభంగరీతిమై
సలిపెదునార ! యీప్రకృతి సంస్కృతసమ్మతి, నెక్కఁడయ్యెస
ల్లలితవికాసమా విజయలక్ష్మిని బొందుచునద్దిరే ! యితం
డలఁతియె ? వీనికిం గురువులౌటకు గర్వపడంగఁబోలదే
యలకవిగండపెండెరముల బ్రమెవీనినుతించు టేమిటన్
దలకునోయీతఁడా గురులదగ్గఱఁ బోలిక వెట్టఁజూచినన్
కలుములచేడె కాఁడు చలిగట్టులరాయని యల్లుఁడున్ మఱిన్
నలువయుఁ దాఁగ్షై తగుసనాతనుఁ డాద్యుఁడు సర్వతత్త్వసా
రలలనకున్ మగండు శివరామవధాని సదేశికద్వయున్
జెలువుననీసభన్ గలుగఁ జేసిన వారలనెల్లనీసభా
స్థలిఁగలవారినందఱిని దక్కినయెల్లరఁ బ్రోచుఁగావుతన్
గలుగుటయిట్టి సత్సభలుగాంచుత భాషయు శేష భూషలన్

ఇట్లు సజ్జనవిధేయుండు
వేమూరి వెంకటసుబ్బయ్య

శ్రీగురుభ్యోనమః

శ్రీలక్ష్మీహయగ్రీవో విజయతేతరామ్॥

శ్లో॥ ధారణానన్య। సాధారణీచాస్య। వాగ్ధోరణీజాహ్నవీ। పూరధిక్కా-
రిణీ। సారణీగర్వసంహారిణీ। గానసంచారిణీ। భాతివిద్వన్మనోహారిణీ॥

శ్లో॥ శ్రీమద్భారతభారతీసురసరిద్వాహావగాహైశ్శుభైః
పూతా - శ్శ్రీపతివేంకటేశ కవితాపాథోధిపాథఃకణాః
నృత్యంతః - శివరామశాస్త్రి రసనాంభోజాత పత్రాంచలే
ముక్తాకారతయా సభాసువిదుషాంబాభాంతి శోభాయుతాః

సీ॥ శతవధానవిధాన సందర్భములనెల్ల
నేర్చిదిక్కులఁగీర్తిఁ దార్చినావు
అవధానమునఁబెట్టినట్టి చిక్కులనెల్ల
నోర్చినీపని నీవదీర్చినావు
నడుముగ్రుంగఁగ వ్రాయునడిమివారలకష్ట
మార్చి గీతిని వారిఁదేర్చినావు
పున్నామనరకంబు పోవునాయనుచింత
దీర్చియొజ్జకుఁదుష్టిఁ గూర్చినావు

గీ॥ మేలు,శివరామశాస్త్రిని నోచ్చిగురుని
కనుపమయశంబు ఘటియించునట్టిశిష్యుఁ
డెవిడి,గురువులతో గ్రుద్దులాడకెపుడు
గురుయశంబులనార్జించి కొనఁగదయ్య

కాశీకృష్ణః
శతావధానీ॥

---:o:---

జూపూడి హనుమచ్ఛాస్త్రిగారి చంపక మాలిక.

గురువులరీతిసభ్యులకుఁగూర్చితివెంతో ముదంబు సత్సభాం
తరమున నాశుధారకవితాసతి నిన్ను వరించియుంట దు
స్తరతమమౌ వధానముశతంబునకుం బొనరించుపొంటె నీ-

నిరుపమశక్తిఁ జూపితివనింద్య చరిత్రుఁడవీవుగావె వే
లురి శివరామశాస్త్రి! బుధులుందనివారింది రిఁకేమిచెప్ప మ
ద్గురుకృతపుస్తకంబిదియకొమ్మశతమ్మను కొమ్మరూపికల్
జరపితిఁబారితోషికము శక్తుఁడఁగానిఁక మిత్రరత్నమా! ॥

——:o:——

శ్రీమత్పరదేవతాయైనమః

(బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రులవారివి)

మ॥ జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబునం గాన్కలం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శరద్ద్వావింశతిం బేర్మిహె
చ్చఁగ మాయేలినయీయవధాన కవితాసామ్రాజ్యభారంబుమో
యఁగఁబూనంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై ॥1॥
మ॥ రిపులేతెంచిన రూపడంచుచు ధరిత్రీనాథులర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవుగాకుద్యన్నవేందుండవై
విపరీతంబగు త్రోవఁబోక కవితావీరుండవై వర్ణనీ
యపరాక్రాంతివహింపుమయ్య శివగామయ్యా! చిరంజీవివై ॥2॥
శా॥ బాల్యోద్రేకముమై నెదిర్చితివి కొప్రంపుంగవిగ్రంథసా
కల్యంబుంబానరింతోలేదోయని నీకై కొంకునస్మన్మన
శ్శల్యంబిప్పటికూడఁదీసితివి వత్సా! సత్సభాశోభివై
కల్యాణంబులఁబొందుమయ్య! యిఁకవీఁకన్ శిష్యచూడామణీ! ॥3॥
మ॥ అవనీదేవులు నిస్సమానకవితావ్యాపారవారాశిసం
భవపీయూషరసాభిలిప్తలలితవ్యాహారనీహారులై
యవలోకింప శతావధానమున మాకానందముంగూర్చి గా
రవమున్నిల్పితివయ్య మాఋణముతీఱన్ శిష్యచూడామణీ! ॥4॥
శా॥ స్వర్గీలావతులెల్లరద్భుతపదవ్యాపారమేపార మా
చర్ల బ్రహ్మసుధీగురూత్తముని వాచాపూర్తిఁగీర్తింపఁగా
గీర్లాభంబునుఁగోరి మాదరికిభక్తిన్ శిష్యులేతేరఁగాఁ
దర్లంజేసితి వస్మదీయగురువిద్యావంశచూడామణీ! ॥5॥

——:o:——

శ్రీపరదేవతాయైనమః

(బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులవారివి)

ఉ॥ శత్రులు లేని నీకెవరు జంకిరటంచు మృషారుతిన్మఖ
స్తోత్రము చేయనేర్తు? కవిసోముఁడవై యవధానముం గడుం
జిత్రముగా నొనర్చితని చెప్పక తప్పదు నిక్కమ్ముగా
యత్రియె సాక్షియై విజయమబ్బఁగఁ జేయుత నీకు నెల్లెడన్॥1॥

ఉ॥ సందడిమై సదస్యములు సాఁగినచో నవధానులట్టులే
కందురు పోదురింకొకరి కష్టముజూడఁగ రాత్రియెల్ల నం
దుందురు వత్తురియ్యెడకు నోశివరామయ! నీవధానపుం
దందడియెల్ల రంగొను విధమ్మున నుండుకతమ్మునం బ్రజల్॥2॥

శా॥ నీకున్ శ్రీయును ధీయుఁగల్గుత మఱిన్నీకంఠసారస్యమ
స్తోకంబై యలరారుఁగావుత నినుందూలింపఁగాలేక దు
ర్ధీకుల్ గ్రామ్యశతావధానులిఁక వ్యర్థీభావముం గంద్రుగా
కేకాకారయశంబు గైకొనఁగదోయీ! ఛాత్రచూడామణీ!॥3॥

మ॥ కుతుకంబొప్పసరస్వతిం గొలిచి నేఁగొంతార్జనం జేసితి
న్మతిమన్మఖ్యుని బ్రహ్మఁగొల్చి మఱికొంతన్నేర్చితిన్ విద్దె ని
చ్చితి నీకున్మఱికొంతమందికి యశశ్శ్రీనిల్పితీవో జగ
న్నుతనామా! శివరామ! నీకు నొనరింతున్ దీవనల్ హెచ్చుగన్॥4॥

మ॥ ఎదిరిందమ్మునెఱుంగకే యెవరొ మమ్మెంతేని నిందించునా
యదనన్వచ్చితివద్దుచొచ్చితివి నిన్నవ్వారులక్షింపరై
రది లోకంబెటులో యెఱింగె సభ గణ్యత్వంబు నీకిచ్చి ర
య్యా! దెసల్ నిండె భవద్యశంబు శివరామా! ఛాత్రచూడామణీ!॥5॥

సీ॥ నీతండ్రి వేదవిద్యాతత్పరుండిటనున్నచో నెట్లునినోక్షము నెక్కొ
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్ర యిదిగన్నఁదా నెంత ముదముగనునో
నీయన్న విద్యావినీతితత్పరుఁడిటనిపుడున్న నెంతటియెలమిగనునో
నీతమ్ముఁడవధాననిపుణుఁడీకృతిగన్న నెంతయామోదమ్ము నెనయునొక్కొ

గీ॥ ఇది మహాత్మ్యసంభవంబు నీయెల్లబంధు
వులును బొందెడి మోదమ్ముఁగలిసి యొక్క-
నన్ను నేపొందె భరముఘనంబు మోయ
నెట్లు శివరామ! చెప్పుమోయీ! కుమార !॥6॥

మ॥ కలవిద్దెం బలుమందికిచ్చితిని వీఁకంగొంద తెట్టెట్టులో
మొలమింగూర్చిరి పంగనామమిడి యెల్లెఁగొంద ఆనందముం
గొలుపంబూనిరి నీకతమ్ముననఁదగ్గంగాక యీయెగ్గుఁ ద
గ్గులు వేవే శివరామశాస్త్రి! మదిపొంగుంగాక నాకుద్ధతిన్॥7॥

శా॥ సంతానంబదిలేదు నాకనుమనశ్శల్యంబు నీవై దుమీ
కాంతుల్ద్రోచెఁగదోయి!తండ్రి! నినువాక్కాంతుండుతద్భార్యయున్
స్వాంతంబుంచి యనుగ్రహించి బహుధాసంతుష్టినింజేయుచుం
మంతుగ్గాతసమస్తలోకమునఁ సమ్మానించుఁగాకన్నినున్॥8॥

చ॥ అఱువదియేఁడులాయువని యందురుగాకలిలోన నల్వ దీ
వఱకెగతించె నిప్పటికి వ్యాఘ్రమనన్ జర నోరువిప్పి మ
మ్మరయుచునుండె మాభరమునంతయు నీతలఁదాల్చిచేయు మే
ర్పఱచినత్రోవ నోయి శివరామకవీ! బహుళావధానముల్॥9॥

క॥యస్సనుచుఁగొందఱనఁగాబస్సనుచుంగొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమయశముగొంటిమహాస్సాగర!వృద్ధినందుమా! శివరామా॥10

——:o:——

శ్రీహయగ్రీవాయనమః

శా॥ శ్రీవాగీశమనోజ్ఞవాసవిలసత్సీమా! జగన్నాథ! స
త్సేవోత్సాహవిరాజమానమతి సద్విద్యాప్తి సంసక్తి స
ద్భావాలంకృతిభాసమానవిశదవ్యాహారసంపత్తి త
న్నావీక్షాప్రతిపన్నభూతి శివరామప్రౌఢు నందింపుమీ॥

సీ॥ పృచ్ఛకనియమంబు నింపుగానడుపుచు
వృత్తంబులరచించు వేళయందుఁ

బలుకుల పేరిటి బాలకీరముఁబట్టి
విషయాంతరంబను పిల్లి చొరని
మానసంబను నొక్క మహిత పంజరమందు
ధారణాపటిమ చేదానిఁగాచి
వలయునప్పుడు తాను వెలికిఁదీసెడుభంగి
శివరామపండితకవిస్మరింప
గీ॥ రసనరంగమందు రమణీయనాట్యంబు
సలుపుచుండి యిప్డు సభ్యులకును
చిత్తరంజనంబు చెలువుగా నొనరించి
కవికిఁదాను గీర్తికరమునయ్యె॥

చ॥ ఎఱుఁగడు పిల్లకాయయని యెంతయుఁగూర్మి జనింపఁబల్కఁగా
సరియొకొ? వెంకటేశకవిసత్తమ! యీతఁడు బాలుఁడన్న నె
వ్వరు మదివిశ్వసింత్రు? చిఱుఁబ్రాయమె కాని శతావధానియై
సరసమనోజ్ఞ సాధుపదసంపద చేఁదనరారు పద్యముల్
కరముక్రమంబునా కవడిఁగల్పన సేయుచు వింతఁగూర్ప న
ద్దిర! శివరాము నేలగణుతింపఁగరాదొకొ బుద్ధిఁ బెద్దయం
చరమర లేక? చూడనెటులబ్బవొ హృద్యవచోవిధానముల్
తిరుపతి వేంకటేశులను దన్ననిభక్తిని గొల్చువారికిన్॥

ఉ॥ ఆదిని మాతృగర్భగతులై జనియించెడి మానవాళి గ్రం
థాదరణీయగర్భమున నంతటఁ జేరుచుఁ గీర్తిదేహులై
యేదిశలందుఁ గన్గొనిన నెల్లరు సంస్మరియించుచుండ దా
మోదర సత్కృపన్ గరిమ నొప్పి ద్విజన్మముగాంత్రు కాన నో
గాదిలి బాలపండిత! జగద్వినుతాచ్ఛయశంబుఁ గైకొనన్
నాదు హితోపదేశము మనంబున నొక్కెడ నిల్పియుంచుమీ
మేదిని గూర్చునప్పటి నిమేషములోన శతావధాన సం
పాదిత పద్యజాలముల పారముగా ముదమిచ్చినన్ విచా
రోదిత దివ్యకావ్యముల యొప్పెటుకల్గి మనోహరంబులై

పాదుకొనంగఁజాలెడిని పండితపామర హృద్యమై? మన
స్సా దనమెంతయోకలిగి సత్వరబుద్ధిచెలంగ నిశ్చలం
బై దనరారుటెట్లుమది? యట్లగుఁగానఁ బ్రబంధకార్యమం
దే దగుయత్నముల్ సలుపనెంచుము పావన నీతిమార్గముల్
చేదనివీడువారలను జెన్నలరారు మధూక్తిపాకులన్
నీదగు నేర్పుఁజూపిమహనీయవిశుద్ధ వివేకమార్గ మం
దేదిటవొప్పనుండఁగ సుధీగతిఁదెల్పుచుఁ గీర్తినొందుమీ॥

చ॥ సరసులసన్నిధిన్ మెలఁగిసంతతమున్ సుమనోరసజ్ఞతం
బరఁగెడిపాననాళిదరిబంచిన వేడ్కఁజరించిసత్పథం
బరసి గుణానురక్తిమెయి యల్లనఁజేరుచుస్వచ్ఛమానసాం
తరనటనంబుసల్పుఘనతన్ శివరాములకీర్తి హంసియై॥

వి. కృష్ణమాచార్యులు, బి. ఏ. ఎల్ టి.

# చంపకమాలిక

బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

సరసకలాధురంధర ! లసద్రసవత్కవితాభిరామ ! వే
లురిశివరామనామ ! కవిలోకముదావహశాస్త్రసాహితీ
పరిచయశేముషీ విభవబంధురబంధనిబంధనాద్యలం।
కరణచమత్క్రియారచితకావ్యకలాప !యిలాపసత్సభాం।
తరపరినృత్యదాసుకవితానవతామరసాననానిరం।
తరపరిరంభజృంభణవిధానవధాననిధానసద్యశో।
భరితదిగంత! నీకవనవైఖరివింటి; దినాంతతాండవాం।
తరరభసాట్టహాససముదారనటేశజటాకుటీసుధా
కరకిరణౌఘనిస్సరదఖండసుధారసధోరణీసము
త్కరమిళదుచ్ఛలద్ద్విజగాంగఝరీవిలుఠత్తరంగసం।
చరణరవానుషంగసువచఃపరిపాకముగాంచి, గోపికా
వరమురళీపికస్వరవిభాస్వరసుస్వరమాధురీధురం।
ధరవరరాగము ల్వినినదారి శ్రవోగతికింపునింపి,ని
బ్బరపుటొయారంపుంబెళుకుఁ బైదలి కమ్మదనఁపుసొంపువా
తెఱమునిపంట నెక్కొనఁ రసముల్గురియించి, భావవి
స్ఫురణముఁ బెంచి,యర్థములసొంపుదలంచి,యలంక్రియాదివై
ఖరిగనుపించి,పాకముప్రకారనించి,సమంచితప్రసా
దరుచినెఱింగి, నీవలెవధానవిధానకవిత్వచాతురీ
పరిణతిఁజూపఁగాఁగల ప్రభావము సర్వసమర్థులైన నీ
గురులకుగాక తక్కొరులకుఁ లభియించునె?శయ్యయెల్ల సం
కరమొనరించి,పల్కునుడికారము లేక,వికారపాక మే।
ర్పఱచి,రసంబడంచి,తలబ్రద్దలుగొట్టినయేని యర్థపుం
గరిమ రహింప, కెందుకొఱగానిపదంబులచెత్తఁ జేర్చి, యె

బ్బొటికపుం బ్రాసముల్ వ్రాళులు బేరిచి, కక్కుఱితిన్ సమూలముల్
జిఱిగిన ప్రాతగుడ్డకును జిల్లరమానికలందగుల్చు మా
దిరి నెకసెక్కెపుంగయితతీర్పరి మెత్తురొకో? రసంబెకా
యరయఁగఁ బ్రాణమౌను కవితాంగన, కట్టిరసంబు లేనిచీ
దరకయితల్ శవంబనికదా నిరసించెదరట్టి కైత యు
క్కఱపడి విందు రేని నడుగన్ వలెనాయికఁ శ్రోతృవేదనా
భరము, మహాంధకారచయబంధురమైనయమాసరేయిటన్
దరియును దారిదప్పి యొకదట్టపుముండులడొంకవెంట నొం
టరిగ గమించుపాంథుఁడు తటాలున రక్కసకంచెలోఁబడన్
హరిహరి! వానిమానసమునందపు డెట్టిరసంబు పుట్టున
ట్టిరసమె ద్యోతకంబగుఁ గడందివచస్తతియేల? యింతకున్
సరసకవిత్వలాభమది జన్మశతంబులఁ జేసికొన్న బం
ధురవరపుణ్యపుంఫలము; తొల్లిఁట నేర్వత మేల సత్తప
శ్చరణముబూనినావొ, సరసస్ఫుటవాక్యవితానలతాంగి నీ
చరణము లాశ్రయించె, వరసాహితియుంజతగూడె ధారణా
తరుణి తనంతదావలచెఁ దక్కువయేమిఁకనీకు? నోర్పుమై
గురుపదసేవఁ జేసి కయికొన్న లసత్కళకుం ఫలంబు సే
కుతా నవధానపుంగృతి నకుంఠితభంగి యొనర్చినావు నూ
ర్గురికిని ధారణాపటిమ కొంచెమయేనియుఁ దప్పకుండ నీ
గురువుల పేరునిల్పితివి, కోవిదులంధనియించినావు, ని,
ర్ధర నినుగన్నయట్టి తలిదండ్రులభాగ్యవిశేషమెన్న నె
వ్వరికగు? నీకు నిట్టిఘనపాండితినేర్పిన సద్గురూత్తముల్
తిరుపతివేంకటేశ కవిధీరులు ధన్యతగాంచిరెంతయున్
గురునకుం బంగనామమిడు కొంటెతనంబు నెఱుంగనట్టి సు
స్థిరవినయాభిరామగుణసింధుఁడు శిష్యుఁడుగల్గెనంచు మే
ల్గురువము గాంచనౌనికను గాఁదగు భాగ్యమదేమి? పేర్మిమై
పఠువును వాసిఁగూర్చి భగవంతుఁడు నీకుఁ జిరాయువిచ్చుతన్

# A Correction.

## దిద్దుబాటు

### గుంటూరు అవధానము.

“గుంటూరు ఆవధానము” అను పేరట సత్యవాదియను ఉపవిలేఖరి మాకు వ్రాసిన లేఖను వెనుకటిపత్రికలో ప్రచురించియున్నారము. అందు వేలురి శివరామశాస్త్రిగారిచే చేయబడిన శతావధానము సరిగా చేయబడలేదని సత్యవాదిగారు వ్రాసెను. ఇది అసత్యమగు లేఖగా మాకు తరువాత తెలియవచ్చినది. మరియు శివరామశాస్త్రిగారిని శివరాముడనియు సత్యవాదిగారు వ్రాసిరి. మేము ఈపేరు కవిత్వము చెప్పుటయందు తమనమ్రత (Modesty) ను జూపుటకు వహించిన నామమని దలంచి, దిద్దుబాటుచేయకుండ ప్రకటించినారము. వీరినిగూర్చి మేము యెప్పుడును వినియుండకపోవుటచే ఇట్టిపొరబాటు తటస్థించినది. మరియు సత్యవాదిగారు విద్యాధికులనియు లేఖల వ్రాయుటయందు తమజవాబుదారి గ్రహించినవారనియు మేము భావించుటవలన వారి లేఖను ప్రచురముజేసినారము. ఇట్టి పొరబాటు గల్గినందులకు చింతిల్లుచున్నారము.

[ఆంధ్రకేసరి]

బ్రహ్మశ్రీ. పంచాగ్నుల మార్కండేయశాస్త్రిగారు

శ్లో॥ మహాసమితిభాస్వరై ర్వివిధవృత్తపద్యాశుగై
ర్విరోధిమదహారిభి ర్విహ్యాతిధీరతాందర్శయన్
అహో తు శివరామ సూర్యలఘుశక్తిమత్ఫల్గునః
నిజంజయమఘోషయ ద్విబుధలోకసౌఖ్యావహం॥

శ్లో॥ వేలూరివంశకలశాంబుధిపూర్ణచంద్రో
వాచస్పతిస్సుజనకేతురసౌకవీంద్రః
శ్రీమాన్ విభాతి శివరామబుధో ధరిత్ర్యాం
సుశ్లోకకృద్ధృదయరంజకరో మహాత్మా॥

శ్లో॥ శివరామకవేర్వచోమృతంత
ద్విబుధశ్రేణిభి రాదరాద్గృహీతం
శతధాముదమాదదాతిలోకే
పరమానంద ఇవాత్మతత్త్వరూపః